# తాతా జీవితము.



[జమ్సెట్జీ నస్సర్వాంజి తాతాగారి జీవితచారిత్రము—జీవితకార్యానగణము.]

ఇది

కొమాండూరి శఠకోపాచార్యులు, ఎమ్. ఏ. ఆనర్సు, బి. ఎల్. గారిచే

రచియింపఁబడి

శ్రీ చెలికాని లచ్చారావుగారిచే

సంపాదింపఁబడినది.



చిత్రాడ:

శ్రీ రామవిలాస ముద్రాక్షరశాల న్ముద్రితము.

1921.

1 0 0

# సంపాదకీయ భూమిక.

శ్రీయుత జమ్సెట్జీ నస్సర్వాంజి తాతాగారు జొరాస్ట్రియన మతస్థులు. బరోడారాజ్యంబున నవసారి గ్రామంబున 1839 సం॥న జనన మొందిరి. దాదాభాయినౌరోజీ, సర్ దిన్షావాచా, సర్ ఫిరోజిషామెహతా మొదలగు దేశాభిమానప్రముఖులు ఈ పార్సీజాతీయులే. తలిదండ్రుల ప్రధానవృత్తి పౌరోహిత్యము. సాధారణ ఆస్తిపరులు. తాతాగారి చిన్నతనమందు నాయన బుద్ధివిశేషాదులు కనిపెట్టి తమవలె పురోహితకార్యంబులందుఁ బ్రవేశింప నిష్టతలేనివారై ఉన్నతవిద్య నభ్యసించి వ్యాపారంబునం బ్రవేశించుటకు బొంబాయికి 13 వ యేటఁ బంపిరి. 6 సం॥లు ఎల్ఫిన్స్టనుకళాశాలయందు విద్య నభ్యసించి 1868 సం॥రమున కళాశాల విడిచి తండ్రిని కలుసుకొని ఒక లేఖరిగాఁ బ్రవేశించి పిమ్మట వర్తక మారంభించి కొంతద్రవ్య మార్జించెను. పిమ్మట తండ్రియనుమతిని హాంకాంగుద్వీపమున కేగి చీనాతో వ్యాపారమును సాగించుచుండెను. ఇట్లు 4 సం॥లు గడప నాయనతండ్రి ప్రత్తివ్యాపారముగూడ నారంభించుటచే నావ్యాపారంబు నిమిత్తమై బ్యాంకి మొదలగు నేర్పాటులకు 1863 సం॥న బొంబాయికి తిరిగివచ్చెను. అప్పుడు రాకపోకలకు ఎన్నో నెలలు పట్టుచుండెను. 1860 సం॥లో ఉత్తర దక్షిణ అమెరికాలలో కల్లోలములు జరుగుచుండుటచే ప్రత్తివ్యాపారులకు నష్టంబు సంభవించె. కాని అమెరికా యుద్ధమైన కొద్దిరోజులలోనే అబ్సీనియా యుద్ధము తటస్థించినందున యుద్ధపరుకు సప్లయి కంట్రాక్టులో తాతా సంఘమువారికి అపరిమితలాభము కలిగెను. తాతాగారికి ప్రత్తివ్యాపారంబు చేయ బుద్ధిపుట్టెను. దేశాభివృద్ధికర మగుప్రత్తివ్యాపారము వైపు మనసు మరలెను. కొందఱు భాగస్థులఁ జేర్చుకొని నూలు బట్టలు వడుకుట కనువగు నొకయంత్రశాల నిర్మించెను. ఇట్టి పెద్దఫ్యాక్టరీకి నొకదానినికట్టించు నుద్దేశముతో నింగ్లాండు కేగి నావిషయమును పూర్తిగా గ్రహించి తిరిగివచ్చి నాగపురమున 1877 సం॥న కట్టించి పూర్తికాగానే 1885 సం॥రం 'ఎంప్రెస్' అను విక్టోరియారాణిపేరు పెట్టెను. తరువాత 'స్వదేశిమి' ల్లొకటి స్థాపించి లాభంబుగాంచి దేశమున కాదర్శకప్రాయుఁడయ్యెను. లైబ్రరీలు వాటియందుంచి జనుల నాకర్షించుచుండెను. ఉద్యోగస్థులు ఉత్సాహశక్తితోఁ బని చేయుచుండిరి బాగుగాఁ బనిచేయువారలకు బహుమతు లిచ్చుచుండెను. కాలము గడచినవారల కుచితవేతనంబు లిచ్చుచుండెను. ఈవిష్ట అ

మెరికాలనుండి మంచి ప్రత్తివిత్తనంబులు తెప్పించి వ్యవసాయము చేయించెను. గాత్రిలు పనిచేయుటకును అగ్నిభయము లేకుండుటకును విద్యుచ్ఛక్తిదీపములు ప్రవేశపెట్టి యితరయంత్రములకు మార్గదర్శకుఁ డాయెను. జపాను, దగ్గిరనున్న చీనాతో బట్టలవర్తకము చేయ ఇచ్చటనుండు సరకులు నాగిపోయె. యూరోపునావికాసంఘమువారు కేవు నెక్కువ చేసిరి. అప్పుడు తాతా జపానునావికాసంఘమువారిని కలుసుకొని వారిని లోఁబరచుకొన దమ రేగతి యనుకొనిన ఐరోపావారు నిశ్చేష్టులై మిక్కిలి తక్కువకేవులకు దిగిరి.

1887 సంIIకు బొంబాయినగరమున సుమారు 50 యంత్రశాలలు వెలసెను. సంయుక్తరాష్ట్రంబున కరవు సంభవించ వారలకు సదుపాయము లొనర్చెను. ఇట్టుండ 'పులిమీఁద పుట్ర' యన్నట్లు దొరతనమువారు మనదేశపుబట్టలపై పన్ను విధించిరి. అద్దానిఁ బాపునిమిత్తమై తాతా, వాడియాగార్లు ప్రతినిధులుగా నెన్నుకొనఁబడి ఇండియా దొరతనమువారికి అక్రమమును విన్నవించ వారు తృణీకరించ తాతాగారు ఆంగ్లదేశములకరిగి హిందూదేశ మంత్రిగారితోఁ జర్చించిరి. లాభనష్టములు చూపిరి. మేల్కొన్నవానిని లేపుట యేమియు కార్యకారి కాకపోయెను. జనుల హృదయంబులందు సంక్షోభము కలిగెను. విదేశంబున యంత్రాలయంబులు, పట్టుపురుగు లభివృద్ధిచే పట్టుబట్టలవ్యాపారము స్వదేశమున సన్నగిల తాతాగారు చీనా జపానులకేగి పట్టుపురుగు లభివృద్ధిమార్గంబు లరసి వీటికి పెంపునకు మైసూరు అనువగునని తలఁచి వాటి నచ్చటకుఁ దెచ్చి పెంచి పట్టువర్తక మభివృద్ధికిఁ దెచ్చెను. చీనా, జపాను, ఫ్రాన్సు, అమెరికాదేశీయుల వ్యాపారమర్మంబులు గ్రహించియు, ఈజిప్టు అమెరికాలోని ప్రత్తివ్యవసాయపద్ధతులను, చీనా, జపాను, ఫ్రాన్సు ఇటలీ దేశములలో పట్టు అభివృద్ధిని జను లవలంబించు పద్ధతులను స్వయముగా నేర్చుకొనియుండెను. వివిధదేశములనుండి ఫలవృక్షాదులు తెప్పించి నవాసారియందు అమూల్యంబైనతోట నాటెను. బీదజనంబులకు ఆరోగ్యకరముగ నుండునటులఁ గుటీరంబులు నిర్మించెను. దేశక్షేమాభివృద్ధికరములగు వైద్యవిద్యాదుల కెంతయో సాయమొనరించెను. తాజ్ మహాల్ హోటల్ బొంబాయియందు చూడఁదగిన ప్రదర్శనములలో నొకటై యున్నది. బొంబాయిరాష్ట్రీయసంఘస్థాపనలోనుండు నొక ప్రముఖుఁడు. విదేశములకుఁ బంపు విద్యార్థుల నిమిత్తమై మూలధన మేర్పరచెను. చెప్పఁబూనిన ఈయన చేసిన మహాకార్యంబు లెన్నియో గలవు. గ్రంథవిస్తరభీతిచే విరమించితిని. ఇట్టి లోకోపకారపరాయణుని, కార్యదీక్షాపరుని, స్వదేశాభిమానిని ఉదారగుణసంపన్నుని, పుత్రరత్నంబును 1904 సంవత్సరమున యూరపుదేశమందు

'నాహీం' అను గ్రామంబున మన భారతమాత గోల్పోయినదని విలపించినప్పుడు ఎవ్వనిహృదయంబు చలించకుండు ? దైవవిధికి ఎవరేమి చేయఁగలరు ? వీరు స్వర్గాలంకృతులైనను వీరి పుత్రిద్వయంబు (వారాబ్జిరత్న తాతాలు) తండ్రి మార్గానుసారులై దేశసేవఁ జేయుచున్నందుల కెంతయు స్తవనీయులు.

చిత్రాడ,
18—3—21.

ఇట్లు,
చెలికాని లచ్చారావు,
సంపాదకుఁడు.

# భూమిక.

---

ప్రతిదేశమునందును ఆర్థిక, సాంఘిక, నైతిక, రాజకీయాది వివిధరూపముల కలుగు అభివృద్ధి సంఘము నున్నతస్థితికిఁ దెచ్చును. జాతీయజీవనమున కన్నివిధముల యభివృద్ధియు నావశ్యకమైనదియే. కాని అందు ఆర్థికస్థితి సరిగా లేనప్పుడు ఆజాతి యితరములగు ఎన్నిమార్గముల నున్నతాదర్శములఁ గలిగియున్నను, స్వల్పకాలముననే సంఘమంతయు క్షీణించిపోవును. తినుట కాహారమును, కట్టుకొనుటకు బట్టయును లేనప్పుడు, ఆదేశీయుల ధార్మికజ్ఞాన మెంత యున్నతముగా నున్నను, వారి నైతిక వృత్తి యెంత తృప్తికరముగ నున్నను జాతియంతయుఁ గ్రమముగా క్షీణించిపోవును. ఈవిషయమును ముఖ్యముగా మనము పాశ్చాత్యదేశములనుండి నేర్చుకొనవలసి యున్నది. పూర్వము ధార్మికాదివిషయము లందువలె ఆర్థికవిషయములందుఁ గూడ మనదేశ మితరదేశములకన్న నుచ్చస్థితియందుండెడిది. కాలక్రమమున నాయాధిక్యము పోవుటలో ఆర్థికస్థితియందు మనకు గలిగిన హైన్య మింక నేవిషయమునను కలుగలేదు. ప్రతిసంవత్సరమును లక్షలకొలఁది జనులు ఆహారము దొరకకపోవుటవలననే మృతినొందుట మనదేశమునఁ దప్ప యింకెక్కడను గానరాదు. మనదేశమునందే విశేషముగా విడువక వ్యాపించుచున్న విషూచి, మహామారి మొదలగు వ్యాధులకు మూలకారణము ప్రజల దారిద్ర్యమే యని గొప్పగొప్ప వైద్యశాస్త్రజ్ఞులు గ్రహించి యున్నారు. ఇట్టి స్థితినుండి తప్పించుకొనుట యెట్లో అందులకు మన మేమిచేయవచ్చునో తెలిసికొని యట్లాచరించుట ప్రతిభారతీయునకును విధియై యున్నది.

ప్రతిదేశమునందును ప్రతిభాశాలురగు నాయకుల జీవితచర్యలు ఆకాలపు చరిత్రనిర్మాణమునకుఁ దోడ్పడుచున్నవి. ఈప్రతిభావంతులు మాతృదేశవిషయమగు తమ ధర్మమును మరచి దుస్స్వభావము గలిగి స్వదేశద్రోహ మొనరించిరేని యా దేశము వెంటనే అధోగతిపాలగును. ఆల్సిబియడీసుకాలపు గ్రీసుదేశమును, ఔరంగజీబుకాలమునందలి హిందూదేశమును యిందుకు దృష్టాంతములు. కాని యిట్టి దురాహరణములు చరిత్రమున మిక్కిలి యరుదుగమాత్రమే కాననగును. సాధారణముగా దేశముచ్ఛస్థితికి వచ్చుసమయమున ప్రతిభాశాలు రుదయించుటయు, వారి జీవితములు దేశపురోభివృద్ధికి సహాయములును మార్గదర్శకములు నగుటయు సంభవించుచున్నది. గ్రీసు, రోము దేశముల చరిత్రములు మహాపురుషజీవితమయమై యున్నవి. ఎలిజబెతు రాణి కాలమందలి యింగ్లండులో షేక్స్పియరు, ఫ్రాన్సిస్ బేకను మొదలగు

మహాపురుషు లనేకు లౌకికాలౌకిక విషయములం దజ్ఞానాంధకారమును నశింపఁ జేసి తమ జ్ఞానసూర్యునిచే జగత్తును తేజోవంతముగఁ జేసి ప్రసిద్ధులైరి. విక్రమాదిత్య కాలమునందలి భాస, కాళిదాస, ఆర్యభట్ట, వరరుచి, ధన్వంతరి మొదలగువారును, అక్బరుకాలమునందలి అబ్దుల్ ఫజ్లు, అబులుఫైజి, రాజా మానసింగు, రాజా టోడర్ మల్లు జగన్నాథపండితుఁడు మొదలగువారు వివిధశాఖలందు నిపుణులై ప్రసిద్ధులైరి. ఇట్లు చాలనఱకు దేశాభివృద్ధి వివిధశాఖలందలి దేశీయ నాయకులవలన నుత్పత్తినొంది తదుత్తేజితులగు జనులచే వృద్ధినొందింపఁ బడుచున్నది. ప్రపంచ మంతటను ప్రసిద్ధ మగు మనదేశపు ధార్మికచరిత్రము పవిత్రజీవనులగు మహాపురుషుల బోధసిద్ధాంతముల పైనను, వారి యుత్కృష్టజీవనములపైనను ఆధారపడియున్నది.

వాల్మీకి, వ్యాస, కపిల, గౌతమ, బుద్ధ, శంకర, రామానుజ, మధ్వ, రామానంద, కబీర్, నానక, చైతన్య, రామమోహన, దయానంద, రామకృష్ణపరమహంస వివేకానందాదుల నామములు జగత్ప్రసిద్ధము లైనవి. పారిశ్రామిక జీవనమున ప్రస్తుతకాలమం దప్రతిమానములని పేరువడసిన అమెరికా, ఇంగ్లండుదేశములందు స్వయం కృషివలనను, బుద్ధివైశద్యమువలనను బరమదరిద్రులై జన్మించియు, తాము కోట్లకొలఁది ద్రవ్యమును సంపాదించుటయే గాక తమదేశమును పారిశ్రామికజీవనమున నత్యున్నతస్థితికిఁ దెచ్చి కోట్లకొలఁది రూపాయల దానముచే జనసామాన్యమునకుఁ గూడ నున్నతవిద్యను లభింపఁజేసియు, శాస్త్రపరిశోధనాదుల వృద్ధిఁజేయుచు యిట్లనేక విధముల స్వజాతిజనులకు మహోపకార మొనరించిన కార్నెజీ, రాక్ఫెల్లర్, రాత్స్ చైల్డు మొదలగు మహనీయు లనేకు లొకరినొకరు మించిపోవుచున్నారు. వీరితో సమకాలీనులు రాజకీయ, నైతికాది జీవితములందుఁ గూడ మహాపురుషులు ప్రస్తుత కాలమున నుత్పన్నులైరి. మనహిందూదేశము కొంతకాలమునుండి సర్వవిషయము లందును జాతీయజీవనమున వెనకఁబడిపోవుచున్నను ప్రస్తుతకాలమున మరల నున్నత స్థితికి క్రమముగా రాఁగల సూచనలు కనఁబడుచున్నవి. ధార్మిక, సాంఘిక, రాజకీయ జీవనములం దనేకులు మహాపురుషులు తమశక్తినంతను ధారఁబోసి జన్మభూమి నున్నతస్థితికిఁ దెచ్చుటకు యత్నించుచున్నారు. ప్రకృతిశాస్త్రజ్ఞానమున జగదీశ చంద్ర, ప్రఫుల్లచంద్రాదులును, సాహిత్యమున రవీంద్రనాథాదులును న్యాయశాస్త్రము, రాసవిహార్యాదులును, యితరదేశములందలి నాయకులకుఁ దీసిపోకయున్నారు. ఈ అన్నివిషయములందును ప్రస్తుతదేశస్థితి ప్రతిభాశాలుర జీవితమునకు ప్రతికూల మగుచున్నను వారి యుత్పత్తియు వృద్ధియు తృప్తికరముగనే యున్నవి. కాని జాతీయజీవనమునం దితరవిషయములందలి యభివృద్ధికన్న ఆర్థికాభివృద్ధి ప్రధానతమ

మని మన మనుకొనియుంటిమి. ఈమార్గమున నితరదేశములం దాదర్శజీవనులగు ప్రతిభాశాలురనేకు లున్నప్పటికిని మనదేశమున వారి సంఖ్య యత్యల్పము. ఇట్టి వారల సంఖ్య యెంత యధికమైన దేశస్థితి యంత శీఘ్రముగ నన్నివిధములను వృద్ధికాం గలదు. అట్టివారలో కరిద్దఱు మాత్రమే మనదేశమున జన్మించి తమప్రతిభచే పారిశ్రామికజీవనమును వృద్ధిపొందించి తమ యౌదార్యమున జనులకు మహోపకార మొనర్చిరి. అట్టివారిలోఁ బ్రధానుఁడగు జమ్సెట్జీ నస్సర్వాంజి టాటాగారి పవిత్రజీవనమున ప్రతిభారతీయుఁడును తప్పక తెలిసికొనఁదగిన విషయము లనేకములు గలవు. భారతమాతయొక్క పుత్రశ్రేష్ఠులలో నొకఁడగు నీమహానుభావుని జీవితమునందలి ప్రధానాంశములను ముఖ్యముగా దేశీయపరిశ్రమలయభివృద్ధికొఱకును, జనసామాన్యమునకుఁ గ్రొత్తఁగా జీవనవృత్తులను కలిగింపఁజేయుటకు నీమహానుభావుఁడు జేసిన వివిధ ప్రయత్నములను గ్రహించిన యెడలఁ బ్రతిభారతీయుని మనస్సునందును దేశీయపరిశ్రమలకు తనచేతనైన సహాయము చేయుటకును సాధ్యమైనంతవఱకు విదేశవస్తువులస్థానమున మనదేశముననే చేయఁబడిన వస్తువుల నుపయోగించి దేశీయవ్యాపారములఁ బ్రోత్సాహ మొసఁగుటకును దృఢనిశ్చయము కలుగును.

ప్రతిదినమును మనకుఁ గావలసియున్న వస్తువులు మనదేశప్రజనులు చవుకగాఁ జేయలేకపోవుచున్నందున మనము అన్యదేశముల వస్తువులనే కొని యుపయోగించుకొనుచున్నాము. అందుకై మనము వ్యయముచేయు ద్రవ్య మంతయు మనదేశము నుండి యితరదేశములకుఁ బోయి అచ్చటివ్యాపారులను గార్మికులను భాగ్యవంతులఁ జేయుటయును మనదేశపు జనులకు వృత్తులు లేక క్షామదేవతపాలగుటయును సంభవించినది. ఇది యెంతయు శోచనీయమగు దుస్థితిగా నున్నది. మనదేశమునుండి యూరపియనుల జీతములు మొదలగువానిరూపమున విదేశములకుఁ బోవుద్రవ్యము వర్తకమువలన యింగ్లండు మొదలగు దేశములకుఁ బోవు ధనప్రవాహములో శతాంశమైన నుండదు. నూరుసంవత్సరములక్రింద మనదేశపు ఆర్థికస్థితి యిప్పటికన్న నిక్కాలి యుత్కృష్టముగా నుండెనని యనేక చారిత్రపండితులును, పాశ్చాత్యప్రమాణికులును వ్రాసియున్నారు. ఈక్రింది యాంగ్లేయాభిప్రాయము దీనిని స్పష్టము చేయును. మద్రాసు రాష్ట్రమునకు గవర్నరుగానుండిన సర్ థామస్ మన్రోగారు సుమారు నూరుసంవత్సరములక్రింద నిట్లు వ్రాసియున్నారు.

“ హిందూదేశమున నచ్చటిజనులకుఁ గావలసినవానిలో చాలవఱకు ప్రతివస్తువయును యూరపునందుకన్న యెక్కువ మంచిదిగాను చవుకగాను తయారు చేయఁబడుచున్నది.

ఇందు ముఖ్యముగా దూదితోను, పట్టుతోను, తోలుతోను చేయఁబడు పదార్థము లన్నియును కాకితము, పాత్రసామాను, ఇనుపవస్తువులు, వ్యవసాయోపకరణములును ఇట్టివియై యున్నవి. ఆకాలమునకును యిప్పటికిని జాల వ్యత్యాసము కలదు. నాగరికతయందు మార్పు కలుగుటవలనఁ బూర్వము మనదేశీయుల కక్కఱలేని వస్తువు లనేకము లిప్పు డావశ్యకము లైనవి. కాని ఆవస్తువులను తయారుచేయుట లేనందున విదేశమునుండి వస్తువులే యుపయోగింపఁ బడుచున్నవి. ఇంతేగాక పూర్వము నుండి మనదేశమున వంశానుగతముగా వచ్చుచుండిన వృత్తులు క్షీణించి వానిస్థానమున విదేశములనుండి వచ్చు బట్టలు, కాకితము, పనిముట్లు మొదలైనవి మనదేశ మందలి జనులచే నుపయోగింపఁబడుచున్నవి. అందువలన మన ముపయోగించు వస్తువులలోఁ జాలభాగము అన్యదేశీయమే అయియున్నది. చిరకాలమునుండి మనదేశమున నివసించి యిచ్చటి స్థితిగతుల యనుభవము కలిగియున్న 'గ్లిన్‌బార్లో' యను నాంగ్ల మహాశయుఁ డిట్లు వ్రాసియున్నాఁడు.

“హైందవుఁడు తన వాలుకుర్చీలోఁ గూరుచుండి తనగదిలో నలుదెసలను జూచి యందలి స్థితిగతులను పరిశీలించునుగాత.”

ఏవంకఁ జూచినను విదేశీయుని వర్తకపుగురుతే కానవచ్చును. తన ప్రక్కనున్న లాంపు జర్మనీలో చేయఁబడినది. దాని చిమ్నీ ఆస్ట్రియాలోను, దానిలోని కిరసినునూనె రష్యా నూనె, వెలిగించు నిప్పుపుల్ల జపాను లేక స్వీడెనులోను చేయఁబడినది. బల్లమీఁద టిక్కుమను పెద్దగడియారము అమెరికాలోను, జేబులో నున్న చిన్నగడియారము జినావాలోను నిర్మింపఁబడినవి. సిరాబుడ్డిలోని సిరా లండనునగరమునను, కలములో నమరియున్న పాళి బర్మింగ్‌హాము పత్తనమునను, జేబులోని పెన్సిలు బవేరియా రాష్ట్రమునను తయారైనవి. తన యొంటిపైని కోటు మారుక్కాషైరులోని గుడ్డనుండి కుట్టఁబడినది. కాళ్లమేజోళ్ళు జర్మనీలో నేయఁబడినవి. తనభార్య రవికను కత్తిరించుచున్న కత్తెర షెఫీలు లేదా జర్మనీలోను, రవికగుడ్డయు దారమును మాంచెష్టరునగరమునను కుట్టుసూది బర్మింగ్‌హాములోను, ఆమె ధరించే పట్టురవికయొక్క గుడ్డ ఫ్రాంసుదేశమునను తయారైనవి. భర్త నములుచున్న బిస్కటు రెడింగునగరమునను, బిస్కట్లనుంచిన పళ్లెము సాఫర్డుషైరులోను, మోచేతియొద్దనున్న సోడా త్రాగు గాజుపాత్రము ఆస్ట్రియాదేశమున చేయఁబడెను. గోడమీఁది చిత్రపటములు జర్మనీయందును, దాని యద్దపుకట్టడమునకు బిగించిన మేకులు బర్మింగ్‌హాములోను తయారయ్యెను. ఇట్లనేకములు కలవు. కాని దీనివలననే హిందూదేశపు పరాధీనస్థితి తెలియఁగలదు.

పైన యుదహరించిన వాక్యములు యుద్ధమునకుఁ బూర్వము వ్రాయఁబడినవి. కానియిప్పటికిని యిందలి జర్మనీ మొదలగు దేశముల స్థానము జపాను మొదలగువాని పాలగుట తప్ప హెచ్చువిశేషము లేదు. ఆవాక్యములం దతిశయోక్తి యెంతమాత్రము లేదు. ఇందు మనము గమనింపఁదగిన శోచనీయ మగువిషయ మొకటి కలదు. అన్యదేశీయము లగువస్తువులను విశేషముగా నుపయోగించువారు సాధారణముగా విద్యావంతులై యున్నారు.

ఈ దురభ్యాసము విద్యావంతుల సహవాసదోషమున సామాన్యజనులలోఁ గూడ యిప్పుడే వ్యాపించుచున్నది. ఆర్థికవిషయమున నింత పరతంత్రస్థితిలో నున్న దేశము నూరు సంవత్సరముల క్రిందనే ప్రపంచములోని భాగ్యవత్తమ మగుదేశముల లో నొకటిగాఁ బరిగణింపఁబడినను ప్రస్తుత మింతకన్న దరిద్ర మగుదేశము వేరె యుండదని పరిగణింపఁబడు స్థితికి వచ్చినది. అందువలన జను లందఱును మఱల సాధ్యమైనంతవఱకు దేశీయవస్తువులను గొనుచు, వర్తకులను దొరకినంతవఱకు దేశీయవస్తువులనే తెప్పించవలసినదిగాఁ బ్రోత్సాహముఁ జేయవలసి యున్నది.

వీలైనయెడల నగరమున నొక్కటియైనను అట్టి దుకాణమును సహకారపద్ధతి నో ప్రముఖులు భాగస్వాములై చేరి పెట్టించి జనులందఱు అందుకొనునట్లు ప్రోత్సాహము జేసినఁగాని విదేశ వస్తుదండయాత్ర తగ్గదు.

ఇట్లు చేసిన పారిశ్రామికనాయకుల కుత్సాహము కల్గును. తాతా వలె యంత్రశాలలను స్థాపించి దేశీయపరిశ్రమల నున్నతస్థితికిఁ దెచ్చు నాయకు లనేకులు దేశమునఁ గల్గినఁగాని సామాన్యజనులకుఁ గావలయు వస్తువులు మనదేశముననే చేయఁబడుటకు దేశమందలి జనులు మఱల భాగ్యవంతులై కరవును జాడ్యములును మఱల తగ్గిపోవుటకును మార్గము కలుగదు.

తాతాగారివలె ప్రతిమనుష్యుఁడును యంత్రశాలలను స్థాపించియు, తాను సంపాదించిన లక్షలకొలఁది ద్రవ్యమును జనోపయోగార్థము సద్వినియోగముఁ జేసియు, జాతీయవృద్ధికి సహాయ మొనర్పలేకపోయినను సామాన్యవిద్యావంతుఁ డగు ప్రతిమనుష్యుఁడును తనకు వీలైనవఱకు తాను దేశీయవస్తువులనే కొని యితరుల నట్లు చేయఁ బ్రోత్సాహముఁ జేసినయెడల అందువలన దేశీయవ్యాపారము వృద్ధియై జనులలోఁ గరవు తగ్గి జీవికార్జనము సులభ మగును.

గ్రంథలేఖనమునం దనుభవము లేకపోయినను, తగినంత సాధనకలాపము లేకపోయినను యీపుస్తకమును నేను వ్రాయుటకు కారణము పైన వ్రాసిన పంక్తులవలననే తెలియఁ గలదు.

తాతాగారి జీవితమునందలి సంగతులన్నియు నత్యుపయోగకరములైనను వానినిగూర్చి విశేషముగా నెవ్వరికిని దెలియుట లేదు. వారి యాబాల్యమిత్రులు వ్యాపారసహచరుఁడుగా నుండిన పార్సీనాయకులలో నొకరగు సర్ దిన్షావాచాగారు ఆంగ్లభాషయందు Life & Life work of J. N. Tata యను రమ్యమగు నొక చిన్నపుస్తకమును వ్రాసిరి.

ఇది చెన్నపురిలో గణేశ కంపెనీ వారిచేఁ బ్రచురింపఁబడినది. ఈ యాంగ్ల గ్రంథము తాతాగారి జీవితములోని ముఖ్యవిషయములను గ్రహించుటకు నాకు చాల ఉపకారకమయ్యెనని నేను వేరుగ వ్రాయనక్కరలేదు. తక్కిన విషయములన్నియు వార్తాపత్రికలు మొదలగువానినుండి గైకొనఁబడినవి. నా కాంధ్రవ్యాకరణమునఁ దగినంత జ్ఞానము లేనందునను పుస్తకము మిక్కిలి స్వల్పకాలమున వ్రాయఁబడినందునను పుస్తకము వ్యాకరణదోషభూయిష్ఠముగా నున్నది. అర్ధానుస్వార శకటరేఫాదులను గమనించుటకు నే నెట్టిప్రయత్నమును జేయలేదు. ఆంధ్రగ్రంథములందలి సాంకేతిక పారిభాషిక పదముల యుపయోగపద్ధతి యొక గొప్ప సమస్యగా నున్నది. చాలవఱకు సంస్కృతపదములే ఉపయోగింపఁబడుచున్నవి. ప్రతిదినమును జనసామాన్యముచే వాడుచుండఁబడు పార్సీ, అరబ్బీ, ఆంగ్లపదములను గ్రంథములనుండి బహిష్కరించుట యోగ్యము కాదు. కాని సంస్కృతపదములు మన దేశభాషలందు వాడుట కెక్కువ యనుకూలముగ నుండును. మనదేశభాషలందలి పరస్పరభేదములను కొంతవఱకైనను తగ్గించుటకై వాడుకలోనుండు సంస్కృతపదములను గ్రంథములలో నెక్కువ విరివిగ వాడుట చాల మంచిది. పారిభాషికపదము లైనను దేశభాష లన్నిఁటియందును ఏకరీతిగా నుండుట యత్యావశ్యకము. యూరపుఖండమందు వివిధభాష లుపయోగింపఁబడుచున్నను అన్ని దేశములందు నుపయోగింపఁబడు సాంకేతికపదము లనేకముగనే యుండును. ఏకదేశమగు మనహిందూదేశమున నట్లు చేయుట యెక్కువ విధిగా నున్నది. దేశభాషలం దన్నిఁటికన్న ముందు పారిభాషికపదము లధికముగ వంగవాఙ్మయమందు వాడఁబడుచుండెను. వీనిలో నధికభాగము సంస్కృతమునుండియే తీసికొనఁబడినది. ఆపదములే యిప్పుడు హిందీ మొదలగు ఉత్తరదేశభాషలలోఁ జాలవఱకు వాడుకలో నున్నవి. మన యాంధ్రమునఁ గూడ చాలవఱకు కట్టిపదములే యుపయోగింపఁబడుచున్నవి. కాని యిదివఱకు వాడుకలోనున్న సంస్కృతపదములు కొన్ని తెలుఁగున నొకయర్థమునను, హిందీ, బెంగాలీ మొదలగు వానియందు మఱియొకయర్థమునను వాడఁబడుచున్నవి. రెండు మూడు ఉదాహరణముల నిచ్చెదను.

| ఆంధ్రము | హిందీ మొ॥ | ఆంగ్లము |
| --- | --- | --- |
| పరిశ్రమము. | ఉద్యోగ. | ఇండస్ట్రీ |
| పారిశ్రామికము. | ఔద్యోగిక. | ఇండస్ట్రియల్ |
| ఉద్యోగి.<br>ఉద్యోగస్థుఁడు. | కర్మచారీ. | Officer. |
| ఉపన్యాసము. | వ్యాఖ్యాన.<br>వక్తృతా. | Lecture. |
| ఆఖ్యాయిక. | ఉపన్యాస. | Novel. |
| విశ్వాసము. | కృతజ్ఞతా. | Gratitude. |
| నమ్మకము. | విశ్వాస. | Confident. |
| జాతీయభాష.<br>సామాన్యభాష. | రాష్ట్రభాషా. | National language. |
| రాష్ట్రభాష. | ప్రాంతీయభాషా. | Provincial language. |

ఇట్టిపదము లింక ననేకము లుండుటకు సందేహము లేదు. ఆంధ్రముకంటె హిందీ మొదలగు ననేకభాషలం దుపయోగింపఁబడు పదముల కాయర్థమున నధికప్రచార మున్నందున తెలుఁగునఁగూడ నట్టియర్థముననే వాడుట యుక్తమని నాకుఁ దోఁచుచున్నది. ఐన నట్లు చేయుట యీవఱ కున్నవాడుకకు కేవలము విరుద్ధముగా నుండునని యీపుస్తకమున నట్లు చేయలేదు. భాషాభిమానులీవిషయమును పరిష్కరింప యత్నింతురు గాక.

ఈ గ్రంథము లోకోపకారార్థమై అచ్చువేయించి ప్రకటించిన శ్రీ లచ్చా రావుగారికి నాకృతజ్ఞతావందనంబు లర్పించుచున్నాఁడను.

గ్రంథకర్త,

కోమాండూరి శఠకోపాచార్యులు.

శ్రీ ర స్తు.

# తా తా జీ వి త ము.

## ౧ వ అ ధ్యా య ము.

—:-(o)-:—

మన భరతఖండమునందు ఆర్యద్రావిడాద్యనేకజాతుల జనులు కలరు. వీరందఱు నేకమతస్థులు కారు. మనదేశమున వ్యాపించి యున్న యనేక మతములలో హిందూ మహామ్మదీయ మతములు ముఖ్యముగా నందఱకును దెలిసియున్నవి. హిందువులు సుమారు 22 కోట్ల జనులు కలరు. మహామ్మదీయులు మనదేశమున సుమా రెనిమిది కోట్లవఱకు నున్నారు. క్రిస్టియన్, బౌద్ధ, జైన, సిక్కు మొదలగు నితర మతస్థులు హిందూదేశమున పై రెండుమతములవారికన్న మిక్కిలి తక్కువగా నున్నారు, కాని భరతఖండమున భిన్నభిన్నమతస్థులలో నందఱికన్న స్వల్పసంఖ్యాకులు పార్సీలు. వీరు ప్రస్తుత మొకలక్ష జనులుమాత్రి ముందురు. అయినను వీరు చాలవిషయములందు నితరజాతులకన్న బ్రముఖులై యున్నారు. వీరి మతాచారాదివిషయములు వినోదకరములు.

### చ రి త్ర ము.

పార్సీ లార్యజాతీయులు. ఆర్యుల మూలస్థానము మధ్య ఆసియాఖండ మని కొంతమందియు, యూరపుఖండపు బాల్టికుసముద్ర ప్రాంత మని కొందఱును అభిప్రాయపడి యున్నారు. కాని ఆర్యులు తమ మూలస్థానమునుండి యతిప్రాచీనకాలముననే రెండుశాఖలుగా విడి యొకశాఖ యూరపులోని గ్రీసు, ఇటలీ, జర్మనీ, ప్రాంసు, ఇంగ్లండు మొదలగు దేశములకు వ్యాపించెననియు, రెండవదియగు ప్రా

చ్యశాఖ పారసీక హిందుస్థాన దేశములకు వ్యాపించెననియు ప్రాచీన చరిత్రశోధకు లంగీకరించి యున్నారు. ప్రాచ్యశాఖ ఇరానియా యను ప్రాచీననామము గల పారసీకదేశమున గొంత కాలము నివాస ముండఁగా వారిలో పరస్పరకలహములు సంభవించి కొంద ఱచ్చటనే నిలిచిపోఁగా తక్కినవారు సింధునదీప్రాంతమునకు వచ్చి క్రమముగా హిందూస్థాన మంతయు వ్యాపించి నట్లు అనేకదృష్టాంతములు కానవచ్చుచున్నవి. ఈకలహమునకే దేవాసురయుద్ధ మని పేరు కల్గినట్లును, దేవజాతి ననుసరించిన వారు హిందూదేశార్యులు వీరి భ్రాతృవర్గములోఁ జేరిన అసురజాతికి సంబంధించిన వారు పారసీకపు ఆర్యులు మన హిందూ ఆర్యుల మూలగ్రంథ మగు ఋగ్వేదమునకును, వారల (పారసీకార్యుల) మూలగ్రంథమగు అవెస్టా యను గ్రంథమునకును భాషయందును, విషయమునందును గల యత్యంతసామీప్యమును బట్టియు, నందలి కథలును, నామములును పరస్పరము సంబంధించి యుండుటవలనను చరిత్రకారు లీసంగతులను గ్రహించుటకు వీలుపడినది. హిందూదేశార్యులు తరువాత ననేక సుఖదుఃఖములకు లోనై భరతఖండమున నంతటను వ్యాపించి యుత్కృష్టస్థానమున నుండి తమ నాగరికతను వృద్ధిజేసికొని క్రమముగా మరల క్షీణదశకు వచ్చిన సంగతి చరిత్రపాఠకుల కందఱకుఁ దెలిసియే యున్నది. పారసీకార్యులును క్రమముగా బలవంతులై గొప్ప రాజ్యముల స్థాపించి మన హిందూ ఆర్యులవలెనే మొదటినుండియు ధార్మికవిషయములందు శ్రద్ధ వహించి యుండిరి.

ఇట్లుండఁగా మహమ్మదుమరణానంతరమున మనయొక్క నూతనమతము నవలంబించిన రబ్బులు తమకుగల్గిన ధార్మికవీరావేశమున బ్రపంచమునంతను మహమ్మదీయమయమునుగాఁ జేయనెంచి నలుదిశల జైత్రయాత్రకు వెడలినప్పుడు వారలలో నొకశాఖ పారసీకము

పై దండు వెడలిరి. అతిసమర్థులును యుత్సాహపూరితులును రణనీతియం దారితేరినవారును నగు నావీరవరుల దాడికి పారసీకులు నిలువలేకపోయి చివరకు శరణాగతులైరి. కాని యీమహాతరంగ మచ్చటి ధనధాన్యసంపత్తులను దుడుచుకొనిపోవుటకు వచ్చినది కాదు. వీరినాయకుల ముఖ్యోద్దేశము తమమతాచార్యుఁడగు మహమ్మదు మతమును జనులందఱును స్వీకరించునట్లు చేయుటయే కాని రాజ్యముచేసి ద్రవ్యమును బేరును సంపాదించుట వీరి కానుషంగికఫలముమాత్ర మయ్యెను. అందువలన వీరు ఖురాను నొకచేతను ఖడ్గము నొకచేతను బూని రెంటిలో నొకదానికి సమ్మతింపక దీరదని స్పష్టముగా నాదేశీయులకుఁ బ్రకటించిరి. సామాన్యముగా జనులకు ప్రాణభయముకన్న నధికభయము లేనందున జాలమంది పారసీకు లందఱును వెంటనే ముసల్మానులై తమప్రాణములను రక్షించుకొనిరి. అప్పటినుండియు వారి మతాచారభాషాదులు అరబ్బుమయమయ్యెను. కాని కొందఱు ధీరులు తమ పూర్వమతమునందలి భక్తిని విడనాడలేక శత్రువులను గెల్చుట యసాధ్యమై వేఱుగతి లేనందున భగవంతునిపై భారమునైచి స్వదేశమును విడనాడి సముద్రముపై నోడలందుఁ బ్రయాణమైరి. వారెట్లో గండములు గడచి హిందూదేశపు పశ్చిమప్రాంతమునకుఁ జేరి యప్పటినుండియు (సుమారు క్రీ. శ. 720) యీదేశమును దమ నివాసస్థానముగాఁ జేసికొనిరి.

ఈప్రాంతము నప్పుడప్పుడు పరిపాలించుచు వచ్చిన రాజులు యీనూతనాతిథులను గౌరవించి స్వేచ్ఛతో జీవింపనిచ్చిరి. హిందూరాజులు వీరిని గోమాంసమును భుజింపరాదని కోరిరి. మహమ్మదీయ రాజులు సూకరమాంసమును ద్యజింపఁగోరిరి. వీ రందుల కంగీకరించిరి. పారసీకమునుండి వచ్చినందున వీరలకు పార్సీలని పేరు వచ్చెను. ఇప్పటికిని పార్సీలీ రెండువిధములగు మాంసములను భుజింపరు. ఎందు

కొఱకు సర్వకష్టములకును బ్రాణాపాయమునకును భయపడక స్వర్గముకన్న నధిక ప్రేమపాత్రమగు జన్మభూమిని విడిచి భయంకరమగు సముద్రమును దాటి సర్వమతజనులకు సమముగా నాతిథ్యమొసఁగు భరతఖండమును జేరిరో యట్టి స్వమతమును నేఁటికిని పార్సీలు విడనాడక తమ ప్రత్యేకవ్యక్తిత్వమును నిలువఁబెట్టుకొనిరి. వీరి మతగురువు జరాతస్త్రుఁ డనునొక పారసీకధార్మికప్రవక్త వీరి పవిత్రగ్రంథము (అవెస్తా) దీనిపై జందు అను వ్యాఖ్యానముకూడ కలదు. మన వేదమునకిది సోదరగ్రంథమని చెప్పనొప్పును. రెండును మిక్కిలి ప్రాచీనగ్రంథములు. ఇవి యేకాలమున నెవరిచే రచియింపఁబడినదియు నిప్పటిని యేచరిత్రశోధకులకును నిశ్చయముగా నిర్ణయించుటకు శక్యము కాలేదు. ఈ రెండు నత్యంత పవిత్రగ్రంథములుగా నెంచఁబడుచు రెండు వేరువేరుమతములకు మూలాధారములైనవి. భాషయం దత్యంతసామీప్యము కలదు. కొన్నిభాగము లందలి భాషలను బోల్చినచో నీరెండుగ్రంథములభాషలును నొకకాలమున నొకేభాషయొక్క ప్రాంతీయవిభేదములుగా మాత్ర ముండినవని దోఁచక మానదు. రెంటియందును గలవిషయము, గాథలును, దేవతల నామములును జాలవఱకొకరీతిగ నున్నవి.

ఆచారములలో గూడ చాల పోలిక కలదు. వేదకాలపు యార్యులవలెనే పార్సీలును అగ్నిపూజకులు. వీరికిని ఉపనయనము, మౌంజిధారణము మొదలగు సంస్కారము లావశ్యకములు. గోమూత్రముభయజాతులకును మిక్కిలి పవిత్రమైనది.

కాలక్రమమున హిందువులందువలె పార్సీలందును గొన్ని దురాచారములు వ్యాపించెను. కాని మనదేశమున నాంగ్లవిద్య ప్రారంభమైనదిమొదలు రెండుజాతులకును జాలభేదము కలిగినది. పార్సీలు హిందువులకన్న నతిశీఘ్రముగ నాంగ్లవిద్యను గ్రహించి సముద్ర

యానమును, సంఘసంస్కరణమును నవలంబించిరి. పార్సీజాతికి సహజ ధర్మములగు ధైర్యసాహసములును, పట్టుదలయు, వారిసంఖ్య మిక్కిలి తక్కువయగుటయు, వారియందు విద్య శీఘ్రతరముగ వ్యాపించుటకును, సంఘము పూర్తిగ మారిపోవుటకును గారణ మయ్యెను. వీరు తమ ప్రాచీనపుపారసీకభాషను మఱచి తాము నివసించు ప్రాంతమునందలి భాషయగు గుజరాతినే తమస్వభాషగఁ జేసికొని యందలి వాఙ్మయమునకు చాల యభివృద్ధిని గలుగఁజేసిరి. ఇప్పుడు స్వభాషయందు విద్యావంతులుగాని, పురుషులుగాని, స్త్రీలుగాని పార్సీలలో మిక్కిలితక్కువ. ఇంతేకాక వ్యాపారము మొదలగు వానికొఱకు చాలామంది యింగ్లీషును హిందుస్థానిని నేర్చుకొందురు. కష్టకాలమున తమకాతిథ్య మొసఁగి గౌరవించి యప్పటినుండియు తమకు నివాసస్థానముగా నేర్పడిన భరతఖండముపై పార్సీలకుఁ గలిగిన యభిమానమును ప్రేమయు దినదినాభివృద్ధిఁ గాంచెను. వీరి స్వల్పసంఖ్యను బట్టిచూడ హిందూదేశజనులలో స్వదేశమునకు వీరుచేసినంత యుపకారము నింకెవ్వరును జేయ లేదని చెప్పవచ్చును. వీరిలో నతిబాల్యవివాహములిప్పుడు మిక్కిలి తగ్గిపోయినవి. స్త్రీలలోఁగూడ విద్య బాగుగ వ్యాపించినది.

జాతియందు భార్య జీవించియుండఁగా బలీయమగు కారణము లేక భర్త వేరొకవివాహమును చేసికొనఁగూడదు. విధవలు పునర్వివాహముఁ జేసికొందురు. సంఘములో స్త్రీలకు స్వతంత్రత కలదు.

ప్రపంచములో నింతటి స్వల్పసంఖ్యాకమైనను—యింతటి కార్యశూరతయు, వ్యవహారదక్షతయు, వర్తకపునైపుణ్యమును, బుద్ధికుశలతయు, దానధర్మములం దౌదార్యమును గనఁబరచిన జాతి వేరొకటి కనఁబడదు. ఈజాతియం దనేకులు మహానీయు లుద్భవించిరి. స్వదేశమున ననేకోద్యోగములు జేసి, ఆంగ్లదేశమున భారతీయుల కుపయోగకరములగు సంఘముల నేర్పఱచి భారతీయులలో మొదటి పార్ల

మెంటుసభ్యుఁడై జాతీయవాఙ్మయమునకు మూలగ్రంథమగు భారతీయదారిద్ర్యము, అనాంగ్లపాలనము, అను నాంగ్లమహాగ్రంథమును రచించి జాతీయమహాస్థాపకులలో నొకఁడై మూఁడుసారులు దానికధ్యక్షుఁడై హిందూదేశ జాతీయపితామహుఁడైన కీర్తిశేషుఁడగు దాదాభాయి నౌరోజీ పార్సిజాతీయుఁడే. వ్యాపారమునను వర్తకమునను మార్గదర్శకులై కోటీశ్వరులై యనేక దానధర్మములఁ జేసి బొంబాయి, అహమ్మదాబాదు, సూరతు మొదలగు నగరములందలి పారిశ్రామిక సంపదకు మూలకారకులై యనేక ధర్మవైద్యశాలలను, విద్యాలయములను, మహాభవనములచే కట్టించిన సర్ ది పెటిటు, సర్ జమ్సెట్జీ జీజీభాయి మొదలగువారును రాజనీతియందును, అర్థనీతియందును, స్థానికస్వరాజ్యవృద్ధియందును వినుతికెక్కిన సర్ దిన్షావాచా, సర్ ఫిరోజిషామెహతా మొదలగువారును యీపార్సిజాతివారే. కొందఱు పశ్చిమదేశములందు విద్య నభ్యసించి ఐ. సి. యస్. మొదలగు పరీక్షలఁ దేరి యున్నతోద్యోగముల వహించిరి. పార్సిజాతీయుఁ డెవ్వఁడును యేయుద్యోగమును లేక వ్యర్థముగా కాలముగడపుటయు, భిక్షార్థియై యొకరి నాశ్రయించుటయు యెక్కడను గానము.

ఇట్టి పార్సిజాతియందు జనించిన జమ్సెట్జీనస్సర్వాంజి టాటా బీదకుటుంబమున జన్మించినను తన బుద్ధికుశలతవలనను, వైపారనైపుణ్యమువలనను, పారిశ్రామికజీవనమునందు నవీనమార్గములను కనబరచి సోదరజనులందును, ముఖ్యముగ బీదలందును, అత్యధికసానుభూతి కలిగి యనేక మహాదానములఁ జేసి కీర్తిశేషుఁ డయ్యెను. వీరి పుత్రులు తమతండ్రిగారు ప్రారంభించిన వ్యాపారములను మఱింత యున్నతస్థితికి దెచ్చియు, ఆయన ప్రారంభింపయత్నించుచుండిన యితరపరిశ్రమల నారంభించియు లక్షలకొలఁది జనులకు జీవనాధారమును గలుగఁజేసి దేశీయపరిశ్రమలను వృద్ధిఁజేయుచున్నారు.

పశ్చిమహిందూదేశమునందలి బొంబాయిప్రాంతమున కుత్తర మున ఘూర్జరదేశము కలదు. ఈదేశము పూర్వము కొంతకాలము చాళుక్యవంశరాజులచే పాలింపఁబడుచుండెను. ఇందలి యుత్తరభాగ మిప్పుడు సంరక్షితదేశీయ రాజ్యమై నవీనాశయసమన్వితుఁడును, ప్రజా విద్యావృద్ధిబద్ధమనస్కుఁడును అగు శ్రీశాయాజీరావుగాయకవారుగారిచే పాలింపఁబడుచున్నది. దక్షిణభాగ మాంగ్లేయుల పరిపాలనమందే యుండి బొంబాయిరాష్ట్రములో చేరియున్నది. ఈదేశము వింధ్యపర్వతశాఖలతోడను, నర్మదా తపతీనదులు మొదలగు జలాశయములచేతను వ్యాప్తమై అనేక నగరారామశోభితమై మనోహరమై యొప్పుచుండును.

ఇచ్చటి జనులు గుజరాతిభాషను మాటాడుదురు. వేయిసంవత్సరములకు పూర్వము స్వధర్మమందలి యభిమానమున మహమ్మదీయుల యధీనమైన స్వదేశమును విడనాడి కష్టములను, అపాయములను సహించి పూర్వకాలపు యోడలపై నెట్లో మహాసముద్రమును దాటి వచ్చిన పార్సీలు గుజరాతిప్రాంతమందలి హిందూరాజులవలన నభయమును గ్రహించి యాప్రాంతమున స్థిరముగా నివాసము నేర్పఱచుకొని సుఖజీవన మొనరించుచుండిరి. వీరి నివాసస్థానములలో నన్నిటికన్న ప్రాచీనమగు నవసారినగరము బరోడాసంస్థానములో తపతినదీ తీరమున నున్నది. పార్సీలలోఁ బూర్వాచారపరాయణులును, మతాచార్యులును నగు దస్తూర్లకు నీపట్టణమే ముఖ్యావాసము. సంఘాచారములందు సంస్కరణములు జరుగుట కిచ్చటివారిలో తీవ్రముగు చర్చ జరుగుచుండును. మతావేశమున పరస్పరవాదోపవాదములు సల్పుచు, నవీనవిద్యను ఉదాహరాదర్శములను, దేశకాలోచితసంస్కరణములను, జొరనీయక ప్రతిఘటించుచుఁ గూపకూర్మములవలె తమస్థితియే సర్వోత్తమమని సంతోషించుచుఁ గాలముగడుపుచుండిన యాందస్తు

ర్లకు ధార్మికవిద్యపై యభిమానముమాత్రము మిక్కిలి యధికముగ నుండెను. నూతనాభిప్రాయములు సంఘమున వ్యాపించినకొలఁదిని యీమతాచార్యుల శాస్త్రచర్చలు దురాచారములఁ దొలఁగించుటకును జనులందు ధార్మికజ్ఞాన మభివృద్ధిజేయుటకును వినియోగింపఁబడుచుఁ దచ్చెను. ఇతరకుటుంబములందలి పార్సీజనులందఱును యీగురువులయొద్దను బురోహితులయొద్దను బాల్యమునఁ గొంత ధార్మికవిద్యను బడసి తరువాత సూరతు, అహమ్మదాబాదు, బొంబాయి మొదలగు మహానగరములందుఁ బ్రవేశించి ముఖ్యముగా వర్తకము మొదలగు లౌకికవ్యాపారములను నేర్పుతోను పట్టుదలతోను నిర్వహించి తమప్రజ్ఞవలనను, నిరంతరకృషివలనను, సంపాదించినధనమును ధర్మకార్యములకై సద్వినియోగము చేయుచుండిరి. పైనఁజెప్పిన సుగుణములన్నియు పార్సీజాతియందలి జను లందఱియందును సాధారణముగాఁ గన్పట్టును.

జమ్సెట్జీ తాతా యం దీగుణము లన్నియు నాజన్మసిద్ధములై యుండి జీవితాంతమువఱకును ఆయనను విడువక దినదినమును మఱింత యధికమగుచుండెను. వీరు గుజరాతినే తమ స్వభాషగాఁ జేసికొని యాభాషయందలి సాహిత్యమును మిక్కిలి వృద్ధిచేయనారంభించిరి. పైన వివరించిన సమయమునందు జమ్సెట్జీనస్సర్వాంజి తాతా 1839 సం॥రమున బరోడారాజ్యమున నవసారినగరమున నొక పురోహితకుటుంబమున జనించెను. తల్లిదండ్రులు విశేషధనవంతులు కారు. శైశవమునుండియు నాబాలునికి గ్రహణధారణశక్తి మిక్కిలి యధికముగా నుండెను. ఆకాలమున నవసారియం దాంగ్లవిద్యాలయములు లేవు. స్వభాషయగు గుజరాతియందే తక్కిన బాలురతో బాటు తాతాయును ధార్మికవిద్యను గణితము, భూగోళము, చరిత్రము మొదలగువానిని నేర్చుకొనెను. మనోగణితమునం దతని కభిలాషము మెండుగా నుండెను. తనబాలుఁడు పురోహితుఁడై నవసారియందు శుష్క

వాదములతో కాలము గడుపుట తండ్రి కిష్టముకానందున పదమూడవయేటనే జమ్సెట్జీతాతా యున్నతవిద్య నభ్యసించి వ్యాపారము నేర్చుకొనుటకు బొంబాయినగరమున కంపఁబడెను.

1852 వ సంవత్సరమున నవసారినుండివచ్చిన జమ్సెట్జీతాతాకు బొంబాయి యొక్కనూతనప్రపంచముగానుండెను. జనసమ్మర్దముతోడను, వివిధజాతులతోడను, అనేకమహావ్యాపారములతోడను నిండియుండి మహాసౌధదృశ్యాలంకృతమగు నమ్మహానగరము నందలిసంఘవిద్యాస్థితికిని నవసారిలోఁ దా నీవఱకుఁ జూచినదానికి నెట్టిసంబంధమును లేకుండెను. అచ్చట లక్షలకొలఁదిజనులున్నను అందు వ్యర్థముగా పనిలేకయుండు మనుష్యు లెవ్వరును లేరు. జ్ఞానసంపాదనమునకంతకన్న ననుకూలమగు స్థలము లేదని తాతాకుతోఁచెను. బొంబాయినందు ఎల్ఫిన్‌స్టనుదొరగారి పేర దొరతనమువారిచే నొక యున్నతవిద్యాలయమును కళాశాలయును నెలకొల్పఁబడి యందు మంచి సమర్థులగు ఉపాధ్యాయులు చక్కఁగా విద్య నేర్పుచుండిరి. జమ్సెట్జీతాతా ఆరుసంవత్సరములవఱకు ఎల్ఫిన్‌స్టను కళాశాలయందు మిక్కిలి శ్రద్ధతో విద్యనభ్యసించెను. తన కీకాలమున సహాధ్యాయులై ప్రాణమిత్రులై యుండిన యనేకులు తరువాత బొంబాయిరాష్ట్రమునం దున్నతస్థానములకువచ్చి దేశీయనాయకులైరి.

1858 యందు తాతా కళాశాలను విడచెను. అప్పుడే మనదేశమునందు గొప్ప యాందోళనము కలిగించిన సిపాయికలహము సమాప్తినొంది దేశమందు నాంగ్లరాజ్యము మఱల దృఢముగా స్థాపింపఁబడెను. నూతనముగా విశ్వవిద్యాలయములును, ఉన్నతన్యాయస్థానములును నెలకొల్పఁబడి ఆంగ్లేయుల నవనాగరికతను వ్యాపింపఁజేయనారంభించెను. ఆసమయమున జమ్సెట్జీ తండ్రిగారు చీనాదేశములో వ్యాపారముచేయుచు కొంతద్రవ్యమును సంపాదించిరి. జమ్సెట్జీ తాతా తనతండ్రిగారి కార్యకరులయొద్ద వ్యాపారముల సూత్రములను నేర్చు

కొనెను. జమాఖర్చులను ద్రవ్యవినిమయమును నేర్చిన తరువాత కొంతవఱకు వ్యాపారములోని మర్మముల నలవరచుకొనెను.

ఆకాలమునందు చీనాదేశముతో హిందూదేశమునుండి నల్లమందువ్యాపారము జరుగుచుండెను. ఈవర్తకము మిక్కిలి లాభకరముగా నుండెను. చీనాదేశతీరమునకు సమీపమున హాంకాంగ్ అను ద్వీపము కలదు. అది ప్రస్తుత మాంగ్లేయుల స్వాధీనమై వారివశముగా నుండి యాప్రాంతమందలి వర్తకము మొదలగువానికి మధ్యస్థానముగా నున్నది. ఆంగ్లేయుల వశమగుటకు పూర్వమే యచ్చట వ్యాపారము నిమిత్తము సూరతుప్రాంతమునుండి యుత్సాహపూరితులగు పార్సీలు కొంద ఱనేక శతయోజనముల దూరమం దుండి వచ్చియున్న వ్యాపారసంఘమును స్థాపించి ధైర్యసాహసములతో వర్తకము సల్పుచుండిరి. ఆకాలమున ప్రయాణసదుపాయములు మిక్కిలి తక్కువగా నుండెను. ఇప్పుడు కొన్ని దినములలో చేయు ప్రయాణ మప్పు డనేకమాసములు పట్టుచుండెను. తంతీసౌకర్యము మొదలగునవి లేనేలేవు. అనేకాపాయములతోఁ గూడిన యీదూరదేశవ్యాపారమునందు తమతో పోటీకి వచ్చువా రెవ్వరును లేరైరి. అందువలనను చీనాదేశస్థు లందఱును సాధారణముగా నల్లమందుతిను నభ్యాసము కలవారైనందునను ఈ పార్సీవ్యాపారుల కమితలాభము వచ్చుచుండెను. జమ్సెట్జీ తాతా యీ హాంకాంగ్ద్వీపమునకు పంపఁబడి చీనాదేశముతోఁ దండ్రిగారి స్థానమున వ్యాపారమును సాగించుచుండెను.

ఇట్లు నాలుగుసంవత్సరములు చీనావర్తకము జరపి వ్యాపారకుశలతను సంపాదించి 1863 సంవత్సరమున మఱల బొంబాయి వచ్చి చేరెను.

చీనాదేశప్రాంతమునుండి తిరిగివచ్చిన వెంటనే జమ్సెట్జీతాతా ఆంగ్లదేశమునకు వెళ్లవలసి వచ్చెను. ఆంగ్లదేశము బట్టలుతయారుచే

యుటయందు ప్రసిద్ధి కెక్కినది. మనదేశమందు వ్యాపించియున్న స న్ననిబట్టలనూలును, సన్నరకము మల్లులును చాలవఱకు ఆంగ్లదేశము ననే తయారగుచున్నవి.

ఈబట్టలును నూలును తయారుచేయుటకు కావలసిన ప్రత్తి యాంగ్లదేశమున దొరకదు. శీతలదేశ మగుటవలనను ప్రత్తిపండదగిన నల్లరేగడినేల యాదేశమున లేకపోవుటవలనను యచ్చటి ప్రత్తి పండించుట సాధ్యముకాదు. అందువలన తమదూదికర్మాగారములకు గావలసిన ప్రత్తిని ఆంగ్లులు చిరకాలమునుండి యిప్పటివఱకు నన్యదేశములనుండియే తెప్పించుకొనుచున్నారు. ప్రపంచమున ప్రత్తిపండించు ముఖ్యదేశములు మూడు కలవు. అమెరికాలోని సంయుక్తదేశము, ఆఫ్రికాలోని ఈజిప్టు, మన హిందూదేశము. ఈమూడుదేశములందు మాత్రము ప్రత్తిపంట కనుకూలమగు నల్లనేలయు, జలసమృద్ధియు, ఉష్ణతయు కలిగియున్నవి. వీనిలో అమెరికాలోని సంయుక్తదేశమందలి ప్రత్తి మిక్కిలి ప్రశస్తమైనది. దీని నాంగ్లదేశమునకుఁ గొనివచ్చుట కూడ సుకరము. అందువలన నమెరికానుండియే ఇంగ్లండునకు ప్రత్తి యెగుమతి యగుచుండెను. ఈజిప్టులో ప్రత్తివ్యవసాయము కొలఁదికాలముక్రిందను మాత్రమే ప్రారంభింపఁబడినది. ఇట్టి స్థితిలో యుక్తదేశము నంతఃకలహము సంభవించి 1861 మొదలుకొని ఉత్తర దక్షిణభాగప్రజలు వేరుగా రాజ్యమును స్థాపించుకొని పరస్పరము యుద్ధమును ప్రారంభించిరి. యుక్తదేశమునకును ఆంగ్లదేశమునకును మధ్య వేలకొలఁదిమైళ్ల వైశాల్యముగల అట్లాంటికుమహాసముద్రము కలదు. యుక్తదేశపు ప్రత్తి దక్షిణజిల్లాలయందే విశేషముగా పండును. ఉత్తరభాగపు అధికారులు యుద్ధమునందు బలీయులై దక్షిణప్రాంతపు రేవులమార్గముల నన్నింటిని దమ నావలచే బంధించి యితర దేశములకును యుక్తదేశదక్షిణభాగమునకును సముద్రప్రయాణసంబంధము

లేకుండఁ జేసిరి. అందువలన నాంగ్లేయులు ప్రత్తి తెచ్చుకొనుటకు వీలులేకపోయినందున లంకషైరుజిల్లాలోని దూదికర్మాగారములన్నియు నిలిచిపోయి వేలకొలఁది జనులు కూలిలేక యుపవసించవలసివచ్చెను. ఆంగ్లేయుల ప్రత్తికఱవును దొలఁగించుటకు హిందూదేశమే యాధారమయ్యెను. విదేశపుగిరాకి హెచ్చినకొలఁదిని మనదేశమందలి ప్రత్తిధరయు హెచ్చఁజొచ్చెను. ప్రత్తి చాలవఱకు బొంబాయిప్రాంతమున నే పండుటవలనను అదియే యప్పటి కాంగ్లదేశమున నన్నిటికన్న దగ్గర రేవుపట్టణ మగుటవలనను బొంబాయివర్తకులకు హెచ్చులాభము కలిగెను. ఇట్లు మూడునాలుగు సంవత్సరములలోనే సుమారు రెబ్బదికోట్లరూపాయలు చేరెను. ఇందు టాటా కంపెనీవారికిగూడ కొంతలాభము కలిగెను. ఇదివఱ కెన్నఁడును దమకు రానిలాభము బొంబాయివర్తకులకు కల్గెను. కాని యాద్రవ్యము నెట్లు వినియోగము చేయుటకును దోఁచక వర్తకులలో కొందఱు ప్రముఖులు గొప్పబాంకులను ప్రవిడెంటుకంపెనీలవంటి కొన్ని సంఘములను స్థాపింపనారంభించిరి. సుప్రసిద్ధులగు ప్రేమచంద్ రామచంద్ అను వీరినాయకుఁడు వ్యాపారకౌశలమున ననేక నూతనసంఘములను స్థాపించెను.

దేశమున నాందోళన మధికమయ్యెను. బొంబాయివర్తకులు తాత్కాలికముగఁ దమయొద్దకు వచ్చుచున్న ద్రవ్యప్రవాహము శాశ్వతముగ నుండునని తలఁచి తమకష్టార్జితమును విచ్చలవిడిగా బాంకులకు ప్రావిడెంటుకంపెనీలకును యొక్కసారి ధారవోయుచుండిరి. ఈధనధార యేదినముననైనను నిలిచిపోవచ్చు ననువిషయమును మఱచిరి.

ఇట్లుండఁ 1865 యందు అమెరికాయుక్తదేశమందలి దక్షిణభాగసేనాని యుద్ధమున నోడింపఁబడి ఉత్తరభాగాధికారులకు శరణాగతుఁడైనందున హఠాత్తుగా యుద్ధము నిలిచిపోయెను. యుద్ధనిర్బంధము పోయినందున అమెరికానుండి ప్రత్తి యెగుమతి మఱల ప్రారంభమై

ఆంగ్లదేశీయులు హిందూదేశపుప్రత్తిని కొనుటను మానివేసిరి. అందువలన బొంబాయివర్తకులకు వచ్చుచుండిన హెచ్చులాభము యొక్కసారిగా నిలిచిపోయెను. ఎగుమతియగుచున్న సరకులు రేవునుండి తిరిగివచ్చెను. కొట్లలో నిలవయున్న ప్రత్తిబేలులు కొనువా రెవ్వరును లేరైరి. దినదినమును ఘంటఘంటకును ధర తగ్గిపోవుచుండెను. అందఱును అమ్మువారేకాని కొనువా రెవ్వరును లేరైరి. ఒక్కొక్కటిగా కంపెనీలన్నియు ద్రవ్యములేక దివాలాయగుటకు ప్రారంభించెను. ఇట్లు దేశమంతటను గొప్ప క్షోభము కల్గెను. ప్రావిడెంటుకంపెనీ లొకదానివెనుక నొకటి యంతరించిపోయెను. బాంకులు కట్టివేయబడెను. ప్రత్తి యెగుమతికై ఆంగ్లదేశమునకుఁ జని లండనులో తండ్రిగారి యాజ్ఞపై నొకబాంకును స్థాపింప నుద్యుక్తుఁడై యున్న జమ్సెట్జి తాతా దూరమాలోచించి బాంకుప్రయత్నమును మానుకొని దూదివ్యాపారమును మాత్రము సల్పుచుండెను. ఇంతలో యుద్ధము నిలిచిపోయి ప్రత్తి గిరాకి తగ్గినందున వ్యాపారము మందమయ్యెను. ఇంతలో బొంబాయిలోని కంపెనీలు దివాలాయగు కల్లోలము జనించినందున నేమియుఁ జేయునది లేక తాతా లండనులోని తమసంఘశాఖను కట్టివేసి బొంబాయికి తిరిగివచ్చెను. బొంబాయిలోని తమ మూలసంఘము నిలువఁబెట్టుకొనుటయే యెంతో కష్టమయ్యెను. ఇందు యితరవ్యాపారములతోఁ బాటు తాతాకంపెనీవారికిని చాలద్రవ్యము నష్టమై చాల కష్టకాలము వచ్చెను. వ్యాపారమున కంతకును పునర్నిర్మాణము కావలసివచ్చెను. తాతా వారు తమయొద్దనున్న స్వల్పద్రవ్యముతో మఱలఁ గొద్దిగొద్దిగా వ్యాపారమును బ్రారంభించిరి. కాని దివాలాలసంక్షోభమువలన దేశమం దొకరిపై నొకరికి ద్రవ్యవిషయమై నమ్మిక పోయినందున వ్యాపారము శీఘ్రముగా వృద్ధియగు మార్గము కనుపడ లేదు.

ఎట్లో ఉపాయముచే వృద్ధిచేసికొనుచున్న టాటాకంపెనీవారికి టా మెదురుచూడని పెద్దబేర మొకటి వచ్చెను. ఆఫ్రికాఖండమందలి తూర్పుభాగమున అబిసీనియా యనుదేశ మొకటి కలదు. అందలిజనులలోఁ జాలమంది నాగరికత లేని యడవిమనుష్యులు. దేశ మంతయుఁ బర్వతములతోను దట్టమగు మహారణ్యములతోను నిండియుండును. ఆ కాలమున నాంగ్లప్రతినిధి యొకఁ డీదేశమునఁ జిక్కుపడినందున ఆదేశపురాజగు థియేడోరుతో మాట్లాడి యాతని విడిపించుటకై యింగ్లీషు దొరతనమువారిద్ద రాంగ్లరాయభారుల నచ్చుటకుఁ బంపిరి. థియేడోరు యాంగ్లప్రతినిధిని విడిపించి పంపుటకు బదులు రాయభారులనుగూడ బట్టి కారాగృహప్రవేశము చేయించెను. అందుపై యింగ్లీషుదొరతనమువారు అబిసీనియారాజుపై యుద్ధమును ప్రకటించిరి. ఈయుద్ధమునకుఁ గావలసిన సమస్తసామగ్రిని సేనానికి సకాలమున నందఁజేయుటకు బొంబాయిలోని కొందఱు వర్తకులతో దొరతనమువా రొక యొడంబడికఁ జేసికొనిరి. దొరతనమువా రిచ్చుద్రవ్య మొక మొత్తముగా నర్తకుల కీయఁబడును. యుద్ధపరికరములయొక్కయు ఆహారసామగ్రియొక్కయు వ్యయము ననుసరించి లాభనష్టములు కలుగవలసియుండెను. ఈవర్తకులలో టాటాకూడ నొక ముఖ్యభాగస్థుఁడైయుండెను. ఆంగ్లసైన్యము అబిసీనియాకు దండయాత్రకు బయలువెడలెను. దేశము మిక్కిలి గహనముగా నుండుటవలన కొండలనన్నిఁటిని దాటి ముఖ్యనగరమును జేరుటకుఁ జాలకాలము పట్టునని యందఱును దలఁచియుండిరి. ఆంగ్లసేన గొప్పఫిరంగులుమొదలగువానితోఁ దనపై దండెత్తివచ్చుచున్నదని తెలిసినవెంటనే అబిసీనియారాజు ఆంగ్లేయాయుధసహాయు లగుశత్రుసేనను జయించుట తనకు సాధ్యముకాదనియుఁ బరాజయము నొంది కష్టములఁబడుటకన్నఁ జచ్చుట మేలని తలఁచి యాత్మహత్య చేసికొనెను. అందువలన నెదిరించువా రెవ్వరును

లీనందున యుద్ధము వెంటనే సమాప్తినొంది సామగ్రుల యవసరము తలపెట్టినదానికన్న మిక్కిలి తగ్గిపోయెను.

ఈగుత్తిబేరమున కంగీకరించిన వర్తకులలో నొకరగు తాతాకిందువలన జాలలాభము వచ్చెను.

ఇట్లు వచ్చిన ద్రవ్యముతోఁ గొత్తవ్యాపారము నొకదానిని ప్రారంభింపఁదలఁచి చక్కఁగా నాలోచించి దేశమునకు మిక్కిలి యావశ్యకమును దనకు మంచిలాభము నిచ్చునదియు నూలుబట్టల తయారుచేయు వ్యాపారమే యని నిశ్చయించి యీ వ్యాపారమును మొదలిడెను.




## ౩వ అధ్యాయము.

వస్త్రము ప్రతిమనుష్యునకును ముఖ్యావశ్యకమగు పదార్థములలో నొకటి. వాటి యే యితరపదార్థము లేకున్నను సవరించుకొనవచ్చునుగాని బట్టలను, ఆహారమును లేక యెంతటివిరుపేదయును సంచరించుటకు వీలులేదు. కొండగుహలలోను అరణ్యములయందును నివసించు అనాగరికులు కూడ యిప్పుడు బట్టలను ధరించుట నేర్చుకొనుచున్నారు. పట్టుబట్టలును, ఉన్నిబట్టలును దూదిబట్టకన్న జాల యెక్కువధర గలవైనందున సాధారణజనులందఱును దూదిబట్టలనే వాడుచున్నారు. అందువలనఁ బ్రతిదేశమందును జనులు దమదేశమందు బట్టలు తయారుజేసికొనవలసి యున్నారు. అట్లు చేసికొనలేనివారు యితరదేశములపై యాధారపడి దేశాంతరమునుండి ధరయిచ్చి వస్త్రములును దెప్పించుకొనుచున్నారు. మన హిందూదేశమున వేలకొలది సంవత్సరములనుండి జనులు నాగరికులై బట్టలను ధరించుయలవాటు కలిగి యుండుటయేగాక, మనదేశముననే ప్రత్తి పండించి బాగుచేసి నూలు తీసి బట్టలను తయారుచేయుటకూడ నీదేశమున ననాదిగా నభ్యసింపఁబడుచున్నది.

చాలదేశములందు ప్రత్తి దొరకదు. అట్టిదేశములందలి జనులు ప్రత్తినైనను, నూలుబట్టలనైనను యితరదేశమునుండి తెప్పించుకో నవలసియున్నది. ఆంగ్లదేశీయులు దూదిని విదేశములనుండి తెప్పించి తమ కర్మాగారములయందు నూలును, బట్టలను తయారుచేయుచు న్నారు. మనదేశమందున ప్రత్తి సమృద్ధిగా లభించుటయేగాక యీ వఱకు చేతమగ్గములపై నేయు సాలెవాండ్రు తరతరములు బాల్యము నుండి కులవృత్తిగా నూలువడకి బట్టనేయుపనిని నేర్చుకొనియున్నం దున యితరదేశములందుకన్న హిందూదేశమున మిక్కిలి చక్కనిబట్ట లు తయారగుచుండెడివి. మొగలాయిచక్రవర్తులకాలమున ప్రభు వులు సాలెవాండ్రకు గొప్పహెచ్చరిక గలిగి అధికారులకు మనస్సు నకుఁ దృప్తికలుగునట్లు యెంతసన్నపుబట్టలనైనను నేయగల్గుచుండిరి. దక్షిణహిందూదేశమందలి కాలికట్ నగరమందు సిద్ధమగుచుండిన కాలి కోలును, వంగదేశమందలి ఢక్కాదేశమందు నేయఁబడుచుండిన ఢ క్కామస్లిన్‌గుడ్డలును, మనదేశమందే విదేశమందు మిక్కిలి ప్రసిద్ధ ములై యింగ్లాండు ఫ్రాన్సుదేశము లందలి గొప్పవారందఱిచేతను ధ రింపఁబడుచుండెను. ఇట్లు నాగరికదేశములందంతటను వ్యాపించి జగ త్ప్రసిద్ధములైన ఢక్కామస్లినులును, కాలికోలును 18 వ శతాబ్దము తరువాత క్రమముగా క్షీణింపఁజొచ్చెను. 18 వ శతాబ్దము మొదట అనగా 1701 మొదలుకొని ఆంగ్లదేశమందలి ప్రజానాయకులకును దొ రతనమువారికిని తమదేశీయులు హిందూదేశవస్త్రములను కొనుచుం డుటవలన ఆవస్త్రములపై యిచ్చుచుండు ద్రవ్యము హిందూదేశపు నేతపనివాండ్రకు ముట్టుచున్నదనియు, హిందూదేశపు వస్త్రములకు బదులుగా తమదేశముననే ఆంగ్లేయులచే తయారైనవస్త్రములను కొ నినచో ఆద్రవ్యమంతయుఁ దమదేశపుపనివాండ్రకే దక్కి వారలకు వృత్తియేర్పడి సుఖజీవనైశ్వర్యములు కలుగుననియు, అందువలన దమ

దేశపుద్రవ్యము అన్యదేశములకుం బోకుండ నుండంగలదనియుం దలంచి సాధ్యమైనంతవఱకు హిందూదేశపు చక్కనివస్త్రములను దుస్తులందు ధరింపక కష్టపడి తమచేతనైన ట్లక్కడిపనివాండ్రు నేసిన ముతకబట్టలనే ధరించుటకు నిశ్చయించుకొనిరి. సాధారణజనుల కంతనియమమును పట్టుదలయు లేనందున వారు తమమోటుబట్టలకన్న చాలరెట్లు తేలికయును సుందరమును సన్ననివియు నగు హిందూదేశవస్త్రములనే ధరించుచుండిరి. ముఖ్యముగా ఇంగ్లండు ఫ్రాంసుదేశములందలి స్త్రీలు సాధారణముగా మనోహరములగు హిందూదేశవస్త్రములతోడనే తమ యుడుపులను కుట్టించుకొనుచుండిరి.

అంతట ఇంగ్లండుదొరతనమువారు తమదేశమునకు దిగుమతియగు భరతఖండపు దూదివస్త్రములపై పన్ను వేయదొడంగిరి. అందువలన వస్త్రములధర ఆంగ్లదేశమందు నేయంబడు వస్త్రములధరకన్న నధికమగును గనుక జనులు కొనరని ప్రభువులు తలంచిరి. కాని యెంతహెచ్చుధరయైనను భాగ్యవంతుల కుటుంబములవారు హిందూదేశపు వస్త్రములనే ధరించుచుండిరి. పన్నును యెన్నిరెట్లు హెచ్చించినను వస్త్రములు దిగుమతి పోలేదు. చివరకు యింగ్లీషుదొరతనమువారు విసికి హిందూదేశపు వస్త్రములను ఆంగ్లదేశమునందలి జను లెవ్వరును ధరింపంగూడదనియు అట్లు ధరించిన జనులు శిక్షింపంబడుదురనియు శాసించి మనదేశపు వస్త్రములను తమదేశమునకు రాసీయకుండం జేయంగలిగిరి. పదునెనిమిదవ శతాబ్దమునుండి మనదేశపు బట్టలపరిశ్రమకు స్వదేశమునకూడ కష్టకాలము వచ్చెను. మొగలుచక్రవర్తుల బలము తగ్గినతోడన దేశమున చిన్నచిన్నరాజు లనేకులు స్వతంత్రులై పరస్పరము కలహింపంజొచ్చిరి. దేశమున శాంతికి భంగముకలిగి జనులు సదా యాత్మరక్షణపరులై యుండివలసి వచ్చెను. చక్కనిబట్టలను హెచ్చుధరయిచ్చి వెనుకటివలె కొనుయధికారులు లేరు. పనివాండ్రు

కు హెచ్చరిక పోయెను. ఇంతలోఁ గ్రమముగా మనదేశము ఇంగ్లీషుకంపెనీవారి స్వాధీనమైనకొలఁదిని వారు యిచ్చటి నేతపనిశ్రమవాండ్రను మిక్కిలి నిరుత్సాహులనుగాఁ జేసిరి. ఈకాలముననే ఆంగ్లదేశమున ఆవిరియంత్రములను క్రొత్తమగ్గములను కనిపెట్టుట తటస్థించెను. ఆదేశప్రజలు హిందూదేశమునుండియు, ఇతరస్థానములనుండియు సంపాదించిన ద్రవ్యముతో నూతనములగు ఆవిరియంత్రముల కర్మాగారములను స్థాపించి మిక్కిలి పట్టుదలతోను, బుద్ధికుశలతతోను, తమదొరతనమువారి సహాయమునను విశేషముగ బట్టలను తయారుచేసి యాబట్టలను మనదేశమునందలి యింగ్లీషుకంపెనీలమూలమున నిచ్చటికి పంపి హిందూదేశీయులు కొనునట్లు చేయఁగల్గిరి. ఈబట్టలు యంత్రములమూలమున చేయఁబడినందునఁ జేతిమగ్గముల సహాయమునఁ జేయుబట్టలకన్న మన్నికయందు హీనములైనను జూచుట కార్షకములుగా నుండి చౌకగానుండుటచే మనదేశప్రజలందఱును స్థూలదృష్టిచే వీనినే కొనుచు నిచ్చట నేయఁబడిన బట్టలను కొనుట మానివేసిరి. అందువలన క్రమముగా చాలవఱకంతరించినవి. నాగరికత హెచ్చి మనవారు విదేశపువస్తువులనే కొనుట యధికమైనకొలఁదిని యిచ్చట పనివాండ్ర వృత్తులుపోయి నిరుద్యోగులై బట్టలు నేసికొనుట మొదలగు వృత్తులను వదలుకొని వ్యవసాయముకొఱకో, కూలికొఱకో వెదకులాడుచు సామాన్యజనులు కూలిదొరికినప్పుడు భుజియించుచు లేనప్పుడేకాదశీవ్రతఫలమును బొందుచు నుండవలసివచ్చెను.

ఇప్పుడు పూర్వకాలపుపద్ధతిని నూలువడకి చేతిమగ్గములపై బట్టలునేసినను దానికగు కాలమునుబట్టియు, శ్రమనుబట్టియు గొప్పయంత్రశాలలందు దినమునకు వందలకొలఁదిగా తయారుచేయఁబడు బట్టలకన్న నేతబట్టలను హెచ్చుధరలకు విక్రయింపవలసినందున కొనువారెవ్వరును లేరైరి. పూర్వపురాట్టములపై తమపితామహులు సన్నటి

నూలును తీయు నేర్పు తమకలవడనందున నిప్పుడు సన్నపునూలు యంత్రసహాయమునఁదప్ప చేయవీలులేదు. ఇట్టిసందర్భమున జేతిమగ్గముల పరిశ్రమ పూర్వపు ఉచ్ఛస్థితికి వచ్చుట యసంభవమని యందఱకును స్పష్టమైనది. లంకషైరుదాడినుండి తప్పించుకొని మరల మనదేశీయులు యిచ్చుట నూలుతీసి బట్టలు సిద్ధముచేయవలెనన్న ఆంగ్లేయులవలెనే గొప్పయంత్రాలయములను స్థాపించి వానిని జయప్రదముగా నడపుటతప్ప గత్యంతరము లేదని యితర బొంబాయివ్యాపారనాయకులతోఁ బాటు తాతాగారును గ్రహించి అట్లుచేయ దృఢనిశ్చయులైరి.

1838 వ సంవత్సరమునుండి కొందఱు వర్తకులు బట్టలునేయు యంత్రాలయములను నిర్మించుటకుఁ బ్రయత్నములు చేసిరి కాని యనేక విఘ్నములవలన నాలస్యమై 1858 వ సంవత్సరమున మాత్రమే మొదటియంత్రాలయము మనదేశమున నెలకొల్పఁబడెను. దాని యభివృద్ధిని జూచి మరికొందఱుగూడ క్రొత్తయంత్రాలయములను స్థాపింపనిశ్చయించి ఆవిరియంత్రములను, నూలుబట్టల యంత్రములను ఆంగ్లదేశమునుండి తెప్పించి బొంబాయిప్రాంతమునందలి దూదితో బట్టలను తయారుచేయ నారంభించిరి. కాని యింతలో నమెరికాయుద్ధమువలన ఆంగ్లేయులు మనదేశపుప్రత్తిని హెచ్చుధరయిచ్చి కొనుచున్నందున ధర మిక్కిలి హెచ్చిపోయి కిట్టుబడి లేక కొంతకాలము విఘ్నముకల్గెను. యుద్ధముకాఁగానే మరల నూతనయంత్రాలయములు స్థాపింపఁబడనారంభించెను. బొంబాయి శీతోష్ణస్థితి అచ్చటి చల్లని నీటిగాలియు బట్టలనేతకును నూలుతీయుటకును అనుకూలముగా నున్నందునను ప్రత్తిపండు జిల్లాలు దానికి సమీపమున నున్నందునను జాలవఱకు మిల్లులు బొంబాయిలోనే స్థాపింపఁబడుచు వచ్చెను.

జమ్సెట్జీతాతా మఱికొందఱు భాగస్థులతోఁ గూడి ఒకయంత్రమును చౌకధరకు కొని దానికి కండెలును మగ్గములును జేర్చి మం

చియంత్రాలయముగాఁ జేసి పనిచేయనారంభించెను. అప్పటికి మన దేశమున నేఁడెనిమిది యంత్రాలయములు మాత్రము బొంబాయి యందు నిర్మింపఁబడెను. ఈయంత్రములన్నియు ముతకబట్టలును ముతకనూలును మాత్రమే నేయఁగలవిగా నుండెను. ఈమిల్లుపై మంచిలాభము వచ్చుచుండెను. అందువలన మఱియొక భాగ్యవంతుఁడు హెచ్చుద్రవ్య మిచ్చి యీమిల్లును కొనుటకు సమ్మతించినందున నందఱు భాగస్థులును కలిసి మిల్లును అమ్మివేసిరి.

ఈయనుభవమువలన మనదేశమున బట్టలయంత్రములవలన మంచిలాభము కలుగునని తాతా గ్రహించి తాను స్వతంత్రముగా నొక యంత్రాలయమును స్థాపింప నిశ్చయించుకొనెను. తాతా యే పనిచేసినను ఆవిషయమును ఓపికతోఁ బూర్తిగా చర్చించి ధైర్యసాహసములతోను పట్టుదలతోను తనసర్వస్వమును అందుకై వినియోగించి యాకార్యమును సాధ్యమైనంతవృద్ధికి తీసికొనివచ్చుస్వభావము కలవాఁడై యుండెను. ఎల్లప్పుడును నవీనపద్ధతులను శోధించి వానిని జయప్రదముగా నడపుటయం దాయన కభిరుచి మిక్కిలి యధికము. అందువలన తానును ఒక ముతకనూలుయంత్రమును బొంబాయిలో నెలకొల్పుటకు బదులుగా అందుపయోగకరము లగుమార్పు లేమిచేయవచ్చునో తెలిసికొనుటకై యావిషయము నామూలాగ్రముగా పరీక్షింపఁ దలఁచి ప్రపంచమున నూలుబట్టల యంత్రపరిశ్రమలకు ముఖ్యస్థానమగు ఆంగ్లదేశములోని లంకషైరునకుఁ బ్రయాణమై వెళ్ళెను. అచ్చట యంత్రాలయముల ప్రధానస్థానమగు మాంచెస్టరునగరమున వ్యాపారనాయకులతోఁ బరిచయము చేసికొని వారినవీనపద్ధతులను గన్నులారఁ జూచి అందలి సూక్ష్మవిషయములను వ్యాపారమర్మములను గ్రహించెను. తాను నేర్చుకొనవలసిన సంగతులను గ్రహించిన వెంటనే తాతా యింగ్లండును విడచి హిందూదేశమును జేరి

మనదేశమున నప్పటికి తయారగుచున్నవానికన్న సన్ననూలును సన్న బట్టలను సిద్ధముచేయుట కనువగు యంత్రములను హెచ్చుధర యిచ్చి ఆంగ్లదేశమునుండి తెప్పించెను. తరువాత యంత్రాలయము లన్నిఁటిని సముద్రతీరమందున్న ఒక్క బొంబాయినగరముననే స్థాపించుట కన్న ప్రత్తిపండుజిల్లాలమధ్యను, సముద్రతీరమునకు దూరముననుబట్టలుకొను జనపదముల సమీపమందును ఆవిరియంత్రములకుఁ గావలయు వంటచెఱుకును నేలబొగ్గును చేరువగను నుండుస్థలమును వెదకి తుదకు మధ్యరాష్ట్రమునందలి ముఖ్యనగరమును వ్యాపారస్థానము నగు నాగపురమునందు యీకంపెనీవారు తమమిల్లును 1877 జనవరి మొదటితేదీని స్థాపించిరి. ఈప్రాంతమున నప్పటికి బట్టలమిల్లు ఆదినముననే శ్రీవిక్టోరియారాణి హిందూదేశచక్రవర్తినీబిరుదమును వహించినందున నీక్రొత్తమిల్లునకు కంపెనీయజమానులు 'ఎంప్రెస్‌మిల్స్' అని పేరిడిరి. ఈయంత్రాలయమున తయారగు బట్టలు చాల మన్నిక గలవియై మెత్తగాను, సన్నగాను, వెడల్పుగాను ఉండి ఇంగ్లీషుబట్టల కన్న చౌకగానుండును. సెంట్రలిండియన్ స్పిన్నింగ్ అండ్ వాలీఁగ్ కంపెనీ యను పేరుగల యీసంఘమునకు మేనేజరుగా నియమింపఁబడిన దాదాభాయి అనునాయన మిక్కిలి సమర్థుఁడై నిరంతరమును గృషిచేసి కార్మికులను బ్రోత్సాహపఱచుచు తాతాగారి క్రొత్తపద్ధతులను జక్కఁగా నాచరణలోనికిఁ దెచ్చుచు నీ ఎంప్రెస్‌మిల్లును మనదేశమునందు ఆదర్శయంత్రాలయమునుగాఁ జేయఁగలిగెను. తాతాగారి యుత్సాహమునకును, ధైర్యమునకును, బట్టుదలకును మేరలేకుండెను. క్రొత్తయంత్రములను క్రొత్తపద్ధతులును దనకు దృష్టిగోచరములైన వెంటనే వానిని చక్కఁగాఁ బరీక్షించి యవి యుపయోగకరములని తోఁచినయెడల ఇలయయంత్రశాలాధికారులు మూఢభక్తిభయమువలన పాతపద్ధతులను విడుచుట కంగీకరింపకపోయినను వారియుపయో

సములకు వెరువక వెంటనే వానిని తమయంత్రాలయములోనికిం బ్రవేశపెట్టును. ముందుగా యేవిషయమును బాగుగా చర్చించి పరీక్షింపక యవలంబించుట లేదు. ప్రారంభించినతరువాత నెన్నికష్టములు వచ్చినను విడచుటలేదు. లాభమువచ్చుటయే యాయన ముఖ్యోద్దేశము కాదు. జనోపయోగమును, వ్యాపారపురోభివృద్ధియును ఆయనకు ముఖ్యాదర్శములుగా నుండెను. ప్రాతయంత్రములు తీసివేయcబడి మాంచెష్టరులో జయప్రదము జరుపcబడుచున్న క్రొత్తరకపు గుండ్రనికండెలును, నవీనోపకరణములును, మిల్లులోc జేర్చcబడెను. కార్మికుల కుత్సాహము కలుగcజేయcబడెను. తన మిల్లులో తయారైన బట్టలు క్రొత్తదేశములలో క్రయమగుట కెప్పుడును ప్రయాణము చేయు ఏజంట్లను నియమించెను. అందువలనను, బట్టలు ప్రశస్తమయినవగుటను ఈబట్టలకు తక్కినవానికన్న జాల యధికక్రయము వచ్చెను. ఆప్రాంతమున నంతటను ప్రత్తిపండుటవలన ప్రత్తిని దెచ్చుటకు బొంబాయిమిల్లులకన్న వీరికి తక్కువవ్యయ మగుచుండెను. ప్రత్తిపండు కొన్ని పెద్దగ్రామములయొద్దనే గింజతీయు యంత్రములు టాటాగారిచే స్థాపింపcబడెను. అందువలన దూదిబేలు లక్కడనే తయారుచేయcబడి వడకుటకు నాగపురమునకు పంపcబడుచుండెను.

ఇట్టిలోపము లేకుండ కనిపెట్టుచు పది, పండ్రెండు సంవత్సరములు తమయాజమాన్యమున యంత్రాలయపుబని జరుగcగా తమ క్రిందియుద్యోగీయు లందఱికిని టాటాగారి పట్టుదలయు, నేర్పును, నవీనపద్ధతులును అలవడెను.

టాటాగారు మునుపటివలె కృషి చేయనవసరములేకయే సర్వమును వారే చేసికొనుచుండిరి. వీరిపైనను కార్మికులపైనను టాటాగారి కమితసానుభూతి కలిగియుండెను. వారి కష్టసుఖములను గమనించి మంచినివాసస్థలముల నొసcగి బాగుగా పనిచేయువారికి బహు

మతులను లాభమున గొంతభాగమును పంచిపెట్టుటచే వారలందఱును యంత్రాలయము తమదే యైనట్లు భావించి నిరంతరము దాని వృద్ధికై శ్రద్ధతోను, యుత్సాహముతోను పనిచేయుచుండిరి. ఈకారణము లన్నిటివలనను యీకంపెనీకి యీదేశమున తక్కిన యేకంపెనీకిని రానంత యధికలాభము వచ్చుచుండెను. చిరకాలము పనిచేసి యశక్తతచేఁ బనిచాలించుకొనువారి కుచితముగా కొంత ద్రవ్యసహాయము చేయఁబడుచుండెను. అందువలన పనివాండ్రకు కష్టముతోఁచక మిల్లు భాగ్యమునుబట్టి తమభాగ్యమును వృద్ధియగునని సంతోషముతో వారు తమపనులను చక్కగా నెరవేర్చుచుండిరి. ఇదిగాక విద్యావంతులగు కొందఱు యువకులు ప్రతిసంవత్సరమును పరిశ్రమలను నేర్చుకొనుటకాయంత్రాలయమునం దుచితముగా చేర్చుకొనఁబడుచుండిరి. నెలనెలకును తమవ్యయమునకై కొంతజీతముకూడ కంపెనీచే వీరి కొసఁగఁబడుచుండెను. వీరట్లు ప్రవేశించినతరువాత మూడుసంవత్సరములవఱ కందు పనిచేయవలసియుందురు. ఈమూడుసంవత్సరములలో తమకిష్టమగు పరిశ్రమను చక్కగా నేర్చుకొనినతరువాత కంపెనీవారి కార్యాలయములయందు ఖాళీ యున్నయెడల తాతాసంఘమువారే తగు వేతనముల నిచ్చి వారల నుద్యోగులనుగా నియమింతురు. లేనిచో వీరు తమయిష్టమువచ్చిన ప్రయత్నము చేసికొనవచ్చును. అందఱును చదువుకొనుటకు గ్రంథములను, పత్రికలను తెప్పింపఁబడుచుండెను. ఇట్లు అన్నివిధములను యీయంత్రాలయము జనాకర్షకమై యితరయంత్రాలయాధికారులకు మార్గదర్శకమై యుండెను.

ఎంప్రెస్‌మిల్లునందు ప్రథమమున నుపయోగమునకు తేఁబడిన యింగ్లండు, జపాను మొదలగు దేశముల ననేక నవీనోపకరణముల నిప్పుడు బొంబాయిలోని యితరయంత్రాలయములవారు కూడ నుపయోగించుచు మంచిలాభమును బొందుచున్నారు. తాను జేసిన ప్రయ

త్నములలోఁ గొన్ని నిష్ఫలములైనను నిరాశుఁడై విడువక మరలమర లఁ గ్రొత్తప్రయత్నములను జేసి తుదకు జయమునందుట టాటాగారి సహజస్వభావమై యుండెను. ఈయంత్రాలయమువారు ఇరువదియారు సంవత్సరములలో తమ మూలధనమునకు 12 రెట్లు లాభమును పొందఁగలిగిరి. ఇందు కొంతభాగము పాతబడిన యంత్రములను బాగు చేయుట మొదలగు కార్యములకొఱకు తీసియుంచఁబడి మిగిలిన దంత యు భాగస్థులకు పంచిపెట్టఁబడెను.

---

## 3 వ అధ్యాయము.

—:-(o)-:—

పది సంవత్సరములు ఎంప్రెస్‌మిల్సును వృద్ధిచేయించి చాలద్ర వ్యమును సంపాదించిన తరువాత జమ్సెట్జీటాటాగారికి మఱియొక బ ట్టలయంత్రశాలను స్థాపింప బుద్ధిపుట్టెను. అప్పటికి బొంబాయిలోని యంత్రశాల లన్నిఁటిలోను ముదకనూలును, ముదకబట్టలును మాత్ర ము తయారగుచుండెను. మేలైన సన్నరకము తయారుకాకపోవుటకు యంత్రలోపమును ప్రత్తిలోపమును గారణములు. మంచినూలును బట్టలును తయారుచేయఁగల సున్నితములగు కండెలును, మగ్గములును క్రొత్తగా ఆంగ్లదేశమున కనిపెట్టఁబడి మాంచష్టరునగరమున క్రొత్త గా కొన్నిసంఘముల యంత్రములందు చేర్చఁబడి చక్కగా పనిచేయు చుండెను. వీనివిలువ మిక్కిలి యధికముగా నుండెను. మనదేశమం దలి బొంబాయిలోని యంత్రాలయాధికారులకు చిరకాలమునుండి యు పయోగములోనున్న వానిని దీసివేసి యీవఱకు తాము చూచి పరీ క్షించియెఱుఁగని క్రొత్తయంత్రముల నమర్చుటయం దిష్టము లేక పోయెను. ఏవిషయమునైనను పూర్వపువస్తువులమీఁదను, పూర్వా చారములమీఁదను మనుష్యుల కాదరము మిక్కిలి మెండుగానుండును.

ఎంతమంచివైనను నవీనవస్తువులపైనను, ఆచారములపైనను, అను
మానమును, ప్రతికూలభావమును కల్గుట లోకసహజము. ఈస్వభా
వము మనహిందూదేశమున పూర్వకాలమునుండియు కల్గియున్నది.
కవీశ్వరుఁ డగు కాళిదాసు ఒకచోట 'పురాణమిత్యేవ నసాధుసర్వం న
చాపినర్వం నవమిత్యవద్యమ్' అని హెచ్చరించియున్నాఁడు. తాతా
గారు తనతోటి మిల్లాధికారులతో క్రొత్తరీతివగు మంచియంత్రము
లను తెప్పించవలసినదనియు, వానివలన నధికలాభమేకాని నష్టము క
లుగదనియుఁ జెప్పిరి. కాని ప్రయోజనము లేకపోయెను. సన్ననూలు
సిద్ధముకాకపోవుటకు రెండవకారణము కార్పాసలోపము. మనదేశ
మందలి ప్రత్తి మిక్కిలి హీనమైనది. ఈప్రత్తినుండి సన్ననూలు తీ
యుట సాధ్యముకాదు. తెగిపోక సరిగా సన్ననూలు వచ్చుటకు ప్రశ
స్తమగు దూది కావలయును. అందుకై యీదేశమున మనము వాడు
చున్న గింజలను వదలివేసి ఈజిప్టు అమెరికా మొదలగుదేశముల ప్ర
త్తిగింజలను తెప్పించి అనుకూలమగు మంచిభూములయందు నాటి స
మృద్ధిగా నీరుకట్టి వ్యవసాయము చేయించుటకు తక్కిన మిల్లు అధికారు
లకు తాతాగారు ప్రోత్సాహము చేసిరి. కాని, ప్రయోజనము లేకపోయె
ను. తక్కినవారు తనసలహాను పెడచెవిని బెట్టినను తాతాగారికి బొం
బాయిప్రాంతమున మంచిబట్టలను తయారుచేయు ఆశ పోలేదు. ఈజి
ప్టుదేశమునుండి మంచిప్రత్తిని తెప్పించియు అచ్చటిగింజలతో మనదే
శమున వ్యవసాయమును చేయించియు తనకుకావలసిన మంచిదూదిని
సంపాదించి తాతాగారు బొంబాయిలో నొకదూది యంత్రాలయము
ను స్థాపింప నారంభించిరి. అప్పుడు బొంబాయిలో ధరంసీయను నొక
యంత్రాలయము వేలము వేయఁబడుచుండెను, తాతాగారు దానిని
కొనిరి. కానియందలి ముఖ్యయంత్రములన్నియు తాతాయొక్క యు
ద్దేశమునకు సరిపోయినవి కావు. అయినను అధైర్యమును జెందక వా

నిని తీసివేయరాని ప్రశస్తమైనయంత్రముల నింగ్లండునుండి తెప్పించి అమర్చి క్రొత్తకర్మాగారమును నిర్మింపఁజేసి దానికి స్వదేశిమిల్స్ అని సార్థకనామము చేసిరి. ఈయంత్రాలయము 1885 నుండి సన్నని ప్రశస్తమగు నూలును, బట్టలనుతయారుచేయ నారంభించి క్రమముగా ఎంప్రెస్‌మిల్సుకు తీసిపోక తృప్తికరమయ్యెను. తరువాత దీనినిచూచి తక్కిన కంపెనీవారిలోకూడ కొందఱిట్టియంత్రములను తెప్పించి మంచిబట్టలను సిద్ధముచేయ నారంభించిరి. వీరిట్లుచేయుటకు మఱియొక కారణముకూడఁ గల్గెను. ఈవఱకు బొంబాయిమిల్లులో తయారగుచున్న ముడకనూలును బట్టలును పూర్తిగా మనదేశములోనే ఖర్చగుట లేదు. కొందఱు బీదజనులు వీనిని కొనుచుండిరి. దేశమున నాగరికత హెచ్చినకొలఁది 20, 30 నెంబరు నూలుబట్టలను ధరించుచుండిన చాలమంది ఆంగ్లదేశమున తయారైవచ్చుచున్న సన్ననూలు బట్టలనేగాని వీనిని ధరింపరైరి. బొంబాయి యంత్రాలయాధికారులు తమసరకుల లో చాలభాగమును నావలపై చీనా, జపానుదేశములు కెగుమతిఁజేసి యచ్చట విక్రయించుకొనవలసినవారైరి. ఇట్లు కొన్నిసంవత్సరములు జరుగుచుండెను. కాని కాలక్రమమున జపానుదేశమున ఒకగొప్ప మార్పుకలిగెను. అంతవఱకును పాశ్చాత్యదేశములతో నెట్టిసంబంధమునకును యిష్టపడక కాలక్షేపముచేయుచుండిన చీనా, జపానుదేశములలో జపానువారు తమ పూర్వపు ప్రతికూలభావమును విడచి యూరపు, అమెరికాదేశీయుల నాగరికత నవలంబించుటయేకాక ఆదేశములనుండియు హిందూదేశమునుండియు తామీవఱకుఁ దెప్పించుకొనుచుండిన బట్టలు మొదలగు వస్తువులను తమ దేశముననే స్వయముగ తయారుచేయించుకొని తమదేశపుద్రవ్యమును వ్యర్థముగా నన్యదేశములకు పోనీయక తమ కూలిజనులకును, వ్యాపారులకును, దారిద్ర్యమువదలి సంపదకలుగునట్లు చేయనిశ్చయించుకొనిరి. ప్రభువు లానిశ్చయమునుచేసిన కొ

లేదికాలముననే కొందఱు విద్యావంతులును, బుద్ధిమంతులును, అగు జపాను యువకులు అమెరికా యుక్తదేశమునకును ఆంగ్లదేశమునకును, పంపఁబడి అచ్చట యంత్రాలయములను నడపువిధమును చక్కఁగా నేర్చుకొని తమ దేశమునకు తిరిగివచ్చిరి. జపానువ్యాపారులు వెంటనే తమదేశమునకు యంత్రములు తెప్పించి యంత్రాలయసంఘముల స్థాపించి యీయువకులను కర్మాగారోద్యోగులనుగా నియమించిరి. జపాను దేశీయుల సహజమగు అభినివేశమువలనను స్వతంత్రుఁడు స్వదేశాభివృద్ధి బద్ధకంకణుఁడు నైన ముత్సుహితో యను జపానుచక్రవర్తిగారి వివిధప్రోత్సాహసాహాయ్యమువలనను జపానుదేశమందలి నూలుబట్టలపరిశ్రమ శీఘ్రకాలముననే వృద్ధిఁజెంది ప్రతిసంవత్సరమును అనేక క్రొత్త యంత్రాలయములు జపానులో నిర్మింపఁబడఁజొచ్చెను.

వీనికిఁ గావలసినదూది అమెరికానుండియు, హిందూదేశమునుండియు, కొని తేఁబడుచుండెను. అందువలన జపానుదేశమునకు బొంబాయినుండి పోవుబట్టల యెగుమతి నిలిచిపోవుటయేకాక చీనాదేశమునకుఁ బంపుచుండిన ముతకనూలు బట్టలవిషయమై జపానుకును మనదేశమునకును పోటీసంభవించెను. జపానువ్యాపారులకు విశేషముగా తమప్రభుత్వమువారు కావలసిన సాహాయ్యము నిచ్చుచుండిరి. బొంబాయిమిల్లులకట్టి ప్రోత్సాహ మేమియు లేకుండుటయే గాక దొరతనమువారు మన యంత్రాలయములపై పన్నును, జపానుప్రభుత్వమువారు నావికానిర్మాణమును వృద్ధిచేయించినందున జపాను నావికాసంఘమువారు దేశభక్తిచే తమ దేశపు నూలుబట్టల యెగుమతికి కేవు తగ్గించుచుండిరి. బొంబాయివర్తకులు ఇంగ్లీషునావల మీఁదనే యెగుమతి చేయవలసివచ్చినందున ఇంగ్లీషు నావికాసంఘయజమానులు మనవస్తువులకు కేవు తగ్గించుటకుబదులు కట్టుకట్టి మిక్కిలి యధికమగు కేవునుకోరుచుండిరి. జపానుదేశమునందు ఆవిరియంత్రములను నడపుటకు ముఖ్యముగా కా

వలసిన నేలబొగ్గు కర్మాగారముల సమీపమున తక్కువధరకు సమృద్ధిగా దొరకుచుండెను. బొంబాయికి సమీపమున నేలబొగ్గు గనులు లేకుండుటవలనను వందలకొలఁది మైళ్లదూరముననున్న రాణిగంజ్ మొదలగు స్థలములందలి గనుల బొగ్గును తెచ్చుటకు రైల్వేకంపెనీల విదేశీయ యజమానులు యెక్కువసొమ్ము తీసికొనుచున్నందునను యంత్రముల నడపుట కెక్కువ సొమ్మగుచుండెను.

ఇంతే కాక చీనా జపాను ప్రజ లేకజాతికి చేరినవారగుటచే జపానీయు లనేకులు చీనాదేశమునఁ బ్రయాణము చేసి యెచ్చటెచ్చట సరుకులు కావలసియున్నదియు కొని వారల కెట్టి సరుకులు కావలసియున్నదియు స్వయముగాఁ గనుఁగొని యాసరుకుల నచ్చటికిఁ దెప్పించి వ్యాపారము చేయుచు చీనాలో నివాస మేర్పఱచుకొని యున్నారు. మన కట్టి సదుపాయము లేకపోవుటయే గాక చీనాకు జపానుకున్న హిందూదేశము దూరమగుటవలనను, మతాచారప్రతిబంధకములవలనను, సరుకులను పంపుట యనేక వ్యయ ప్రయాససాధ్యమయ్యెను. ఇట్టి కారణములవలన మనదేశపు మిల్లుల ముతకనూలుయొక్కయు బట్టలయొక్కయు యెగుమతి తగ్గిపోవుచుండెను. కొంతవఱకు సరుకులు తూర్పు ఆఫ్రికా పారసీకము మొదలగు దేశములకు పంపఁబడుచు వచ్చెను. కాని బొంబాయి బట్టలవ్యాపారులలోఁ జాలమందికి విదేశపు యెగుమతిపై ఆధారపడి యుండుటకన్న మనదేశపు నాగరికజనుల కిష్టమగు సన్ననూలుబట్టలను తయారుచేయుట మంచిదని తోఁచి యావశ్యకతకొలఁది ప్రముఖులు కొందఱు తాతాగారి ననుకరించి బొంబాయి అహమ్మదాబాదు మొదలగు నగరములందు మంచి సన్ననూలుబట్టలను సిద్ధము చేయఁదొడఁగిరి.

స్వదేశీమిల్లు మిక్కిలి ప్రాఁతమిల్లుగా నుండినందున నందలి పనికిరానివి తీసివేయించి ఉచ్చకోటివగు మంచి యంత్రములను వానిస్థాన

మున సమర్పించి మిగిలినవానిని బాగుచేయించి బొంబాయిలోని తక్కిన మిల్లు లన్నిటికన్న ప్రశస్తమైన యంత్రాలయముగాఁ జేయించి అందుపై నన్నిటికన్న నధికముగ లాభము కలుగునట్లు చేయుటకు తాతాగారును దమ యనుచరవర్గమును 10 సంవత్సరములవఱకు నిరంతరము కృషిచేయవలసివచ్చెను. ఈయంత్రాలయసంఘమందును నాగపురసంఘమునందువలె ముఖ్యభాగస్థులును ఏజెంట్లును తాతాగారు ఆయనకుమారులునే యైయుండిరి. తక్కిన భాగస్థులకుకూడ పూర్ణముగులాభము కల్గుటకై తయారైన సరకుల యాజమాన్యముచేయు యేజెంట్లు తీసికొనుట కాచారమైయున్న కమీషనును తాతాగారు తమమిల్లులయందు తీసికొనుట మానివేసిరి. యంత్రాలయములలో నుపయోగకరములగు క్రొత్తమార్పు లేదేశమునఁ బ్రారంభింపఁబడినను తాతాగారు వానిని వెంటనే గమనించి తమయంత్రాలయమునఁగూడ పరీక్షించి తమయంత్రాలయమును సాధ్యమైనంత యుత్కృష్టమైనదానినిగాఁ జేయుచుండిరి. ఇతరయంత్రాలయములవలె రాత్రివేళ దూదిమిల్లులను పనిచేయుట సాధ్యము కాదని యంత్రాలయాధికారు లందఱును ఒక మూఢవిశ్వాసము కలిగి యుండిరి. ఇతర కర్మాగారములకన్న వీనియం దగ్నిభయమువలన హాని మిక్కిలి యధికమగుటయు, శీఘ్రతరముగ అపాయము కల్గుటయు వాస్తవమే కాని అయినను విద్యుచ్ఛక్తిదీపములను మాత్రమే యుపయోగించుచు పనిచేసిన రాత్రివేళ కూడ యంత్రముల పనిచేయింపవచ్చునని తాతాగారికి నమ్మకము కలిగె ఆంగ్లదేశమందలి ఒకటి రెండుమిల్లులలో అట్లుచేయుట జయప్రదముగా నుండెనని తెలిసి తాము దమ ఎంప్రెస్ మిల్లును విద్యుచ్ఛక్తిదీపములతో రాత్రివేళ జయప్రదముగ పనిచేయించి కనఁబరచిరి. అయినను రాత్రివేళ పనిచేయుటకు ద్రవ్య మధికముగ వ్యయమగును. పగటివేళ చేయు పని చాల కొన్ని యవసరసమయములం

ను మాత్రమే రాతుల్లందు ప్రస్తుతము దూదియంత్రాలయములు పని చేయును.

---

౪ వ అధ్యాయము.

స్వదేశీమిల్లు కార్యక్రమమునకు దెచ్చి వృద్ధి నొందించినతరు వాత తాతా దానినిగూడ నడపు భారమును తన క్రిందియుద్యోగీయు లపై నుంచి మనదేశమునందలి దూదిబట్టలవ్యాపారమున కవసరమైన కొన్ని విషయములపై శ్రద్ధవహించి పనిచేయవలసి వచ్చెను. అందు ముఖ్యమైనది ప్రత్తివ్యవసాయము. మనదేశమునందలి వ్యవసాయపద్ధతి మిక్కిలియశ్రద్ధతోను పూర్వకాలపు హీనోపకరణములతో బీదలగు విద్యలేని వ్యవసాయజనులచే చేయఁబడుచుండినందున పొలములనుండి గింజతీయుయంత్రాలయముల కెగుమతియగుప్రత్తి హ్రస్వాకారమై సన్న నినూలుతీయుటకు పనికిరానిదై యుండెను. వ్యవసాయజనులకు విద్య రానంతకాలమును విద్యాధికులును ద్రవ్యవంతులును వ్యవసాయము నందు శ్రద్ధవహించి సహాయము చేయనంతవఱకును మనదేశమున మంచి ప్రత్తిపండదనియు, ఉత్తమజాతి ప్రత్తికై విదేశములపై యాధారపడియుండుట భావ్యముకాదనియు, తాతాగారికితోచి స్వయముగా యీజిప్టుదేశమునకు వెళ్లి తాతాగారు అచ్చటి ప్రత్తివ్యవసాయమున కు జనులుపయోగించుమాదిరి విత్తులును నాగళ్లు మొదలగువానిని దె ప్పించి వారి వ్యవసాయపద్ధతులను యిచ్చటి వ్యవసాయజనులకు నేర్పు ఉద్దేశముతో తాము స్వయముగా ప్రత్తి వ్యవసాయమును చేయించి పంటఁబండించిరి. కాని యితర యంత్రాలయాధిపతులు దూరదృష్టి యు శ్రద్ధయు లేనివారైనందున వారు తాతాగారి కీవిషయమున సహా యము చేయనందున వ్యవసాయము విరివిగా వ్యాపించలేదు. ఆకాల

మునందలి మన దేశపు ప్రభుత్వమువారుకూడ యీవిషయమై శ్రద్ధ వహింపక హిందూదేశపు నేలలో ఈజిప్టు, అమెరికాదేశముల ప్రత్తి గింజలు ఫలింపవనిమాత్రము ప్రకటించి యూరకుండిరి. కాని కొలఁది సంవత్సరములక్రింద మన దేశపు ప్రభుత్వ వ్యవసాయశాఖ వారి కృషి వలననే హిందూదేశమందలి కొన్నిభాగములందు ప్రశస్తమగు ప్రత్తి ని పండింపవచ్చునని తెలియవచ్చినది. ఇప్పుడు సింధురాష్ట్ర ప్రాంత మున నిట్టిప్రత్తి పండింపఁబడుచున్నది.

1885 సంవత్సరమునుండి బొంబాయిప్రాంతమందలి లక్షాధికారు లొకరినిజూచి యొకరు క్రొత్త యంత్రాలయములను ప్రతిసంవత్సర మును కట్టనారంభించిరి. వీనిలో తయారగు సరకులు ముదక వగుటచే మనదేశమున కొంతవఱకే ఖర్చుఅయి మిగిలినదంతయు చీనా, జపాను దేశప్రాంతముల కెగుమతిచేయఁబడుచుండెనని మనకుఁ దెలిసియేయు న్నది. దినదిన ప్రవర్ధమానమగు నీయెగుమతి అప్పుడు హిందూదేశ మునకును, చీనా, జపాను, ప్రాంతమునకును పోగయోడలను నడుపు చున్న మూఁడు నావికాసంఘముల యధీనమైయుండెను.

ఈ మూఁడు సంఘములవారును ఐరోపీయులే? ఈయెగుమతికి తామే యాధారమగుటను చూచి మూఁడు సంఘములవారును కలసి కట్టుకట్టి కేవులను మిక్కిలి యధికము చేసిరి. అట్లుచేయుట మిక్కిలి యన్యాయమనియు అందువలన తమకు కలుగుచున్న లాభమంతయు నావికాసంఘములవారికేఁ జెంది తమసరకుల అమ్మకము తగ్గిపోవచ్చు ననియు బొంబాయి వ్యాపారులందరకును తోఁచెను. కాని చేయునది లే నందున అట్లే వారు సరకులను పంపుచుండిరి. తాతాగారు బొంబా యిలో ముఖ్యముగా నీవ్యాపారమును చేయుచుండినందున వారెట్లయి న దీనికి ప్రతిక్రియ చేయవలయునని తలఁచి మఱియొక నావికాసంఘ ము వారెవరైన తక్కువ రేటుకు సరకుల తీసికొనిపోగల చీనా, జపాను

దేశప్రాంతములందు విచారింపఁ దొడఁగిరి. అప్పటికి జపానుదేశమున బట్టయంత్రముల పరిశ్రమ యింకను వృద్ధికానందున తమ దేశమున బొంబాయి బట్టలును, నూలును చౌకగానమ్ముట తమజనులకును యవసరమగుటచే జపానుదేశపు నావికాసంఘము వారొకరు యూరపుకంపెనీలకు పోటీగావచ్చి సరకులను సులభమైన ప్రాతరేటుకు గొనిపోవుటకునమ్మతించిరి. కాని రెండుసంవత్సరముల వరకు కేవుకు తమయోడలనిండ సరకు నెగుమతి చేయుటకు పూఁచీ కావలయునని కోరిరి. అందుపై టాటాగారు మరలి బొంబాయికి వచ్చి అచ్చటి మిగిలిన యంత్రాలను యజమానులతోను యెగుమతిదారులతో ప్రశంసించి వారలనొప్పించి వారిలిఖితాంగీకారమును బడసి జపానుకంపెనీవారికి సరకులగొనిపోవ సందేశము పంపిరి. ఇంతవరకును జరుగుచున్న యాలోచనలును ఒడంబడికలును విఘ్నము లేకుండుటకై రహస్యముగా జరుపఁబడినందున జపానుకంపెనీ నావలు వచ్చి బొంబాయినుండి సరకుల నెక్కించుకొనువరకును యూరోపియను కంపెనీలవారు ఎంత హెచ్చుకేవునైన నిచ్చితమయోడలపై హిందూదేశీయ వ్యాపారులు సరకుల నెగుమతి చేయవలసి యుందురని యానందించుచు యెగుమతి చేయఁదలచువారి ప్రార్థనలను పెడచెవినిఁ బెట్టుచుండిరి. జపానువారి యోడలపై సరకు లెగుమతి యగుచుండుట చూచి దిగ్భ్రమజెంది తమయుక్తికి ప్రతియుక్తిని టాటాగారు పన్నినసంగతిని తెలిసికొని వెంటనే వెనుకటి రేటుచొప్పున సరకులను తీసికొనిపోవుటకు సిద్ధపడి వెనుకటివలె తమ యోడలపైననే బంపవలసినదిగా ఐరోపియనావికానికాయులు కోరిరి. కాని టాటాగారి కొడంబడిక యిచ్చియున్నందునను జపాను యోడలపై సరకు లంపినను తమకు నష్టము లేనందునను సరకుల యజమానులందు కిష్టపడక జపానునావలకే పంపుచుండిరి. అందుపై ఐరోపియను నాయకులు కలసి యాలోచించి యెట్లైనను తమనావికలపైననే సరకులను తీసికొనిపో

యి జపాను నావికలు బొంబాయి పాంతమునకు రాకుండునట్లు చేయ వలయునని యాలోచించి మఱియొక యుక్తి నిపన్నిరి. వారు కేవును వెనుకటికన్న మిక్కిలి తగ్గించివేసి పేరునకు మాత్రి మత్యల్పమైన కేవు నుపుచ్చు కొందుమని ప్రకటించిరి. ఈపొగయోడల కంపెనీవారు చిరకాలమునుండి చాలద్రవ్యమును సంపాదించి భాగ్యవంతులై యుండుటచే ఒకటిరెండు సంవత్సరముల నష్టము వారికొక లక్ష్యములోనిది కాదు. ఈయొకటి రెండు సంవత్సరములలోను జపానునావికులకు పరాభవము కల్గించి వారల నిక్కడియెడుమతికిపోటీకి రా నీయకుండఁజేసి నపిదప యెప్పటియట్లతాము యెక్కువకేవును మఱలహాయిగా వసూలుచేసి కొనవచ్చునని వారలకు తెలియును. మిల్లుయజమానుల మనస్సులలో నాందోళనము కలుగఁజొచ్చెను. తమప్రస్తుత ప్రత్యేకలాభమును బట్టిచూచిన నామమాత్రమగు శుల్కముతో ఐరోపీయ నావికలపై తమసరకులను చితముగ చీనాజపానులకు పంపివెంటనే మంచిలాభమును పొందవచ్చును. కాని అందువలన తాతాగారికి లిఖితరూపముగ తాము చేసిన వాగ్దానమునుండి తప్పిపోవుటయేకాక తరువాత ఐరోపీయ నావికులే యాధారము కావలసినందున మఱల వారలు చెప్పినట్లే వినవలసివచ్చును. తమదేశమునకును నష్టముకల్గును. కాబట్టి వారికిని సాధారణముగా స్వార్థపరతను జయించుటమిక్కిలికష్టముకదా?

ఈ యంత్రాలయాధికారులలో ముఖ్యులు తాము చేయునది హానికరమని ఎఱిఁగియు తాత్కాలిక లాభమునకై యాశపడి ఐరోపీయ కంపెనీల వారిమాటవిని ఏక కాలముననే దేశద్రోహమునకును, మిత్రద్రోహమునకును బడగొట్టిరి. అందువలన తాతాగారు చెప్పినట్లు నిలుపుకొన లేకపోయినందున జపాను కంపెనీవారు విసికి దొరికిన సామానునాసారిమాత్రము తీసికొని వెడలిపోయిరి. సాంఘికరాజకీయవ్యాపారాది సర్వవిషయములందును ఐకమత్యమువలననే సంఘము

సకును జాతికిని యభివృద్ధి కల్గును. సర్వసంపదలతో తులఁదూగుచు
ఆనాఁడినుండియు మహాచక్రవర్తులచే పాలింపఁబడుచు నాగరికతకును
విద్యలకును పుట్టినిల్లయియుండిన హిందూదేశము పరరాజులపాలై స్వ
తంత్రతను గోల్పోయి దారిద్ర్యమునకును దుఃఖములకును పుట్టినిల్లగు
టకు మనదేశమందలి నాయకులకైకమత్యము లేకపోవుట ముఖ్యకార
ణము. కోటివ్యాపారులు దేశాభిమానవిహీనులై దూరదృష్టిలేక మ
నోదౌర్బల్యమునకు లోనై మాటనిలుపుకొనలేకపోయినందుకు తా
తాగారు మిక్కిలి చింతిల్లినను ఆ వ్యాపారములనుగాని మఱి యెవ్వరి
నిగాని నిందింపలేదు. తమతో లిఖితరూపముగ చేసిన యొడంబడిక
నుండి తిరిగిపోయినందుకు నష్టపరిహారమునకై వారిపై నెట్టి యభి
యోగమును కూడ నలుప లేదు. తమ విధ్యుక్తధర్మమును తాము
నెరవేర్చి నందుకును మనలో నైకమత్యము కలిగి ధైర్యముతో య
త్నించిన యెడల యితరుల బెదిరింపులకు మనము భయపడ నక్కఱ
లేదని ప్రత్యక్షముగాఁ గనుపరుపఁ గలిగినందులకును సంతృప్తచిత్తు
లైరి. స్వదేశీమిల్లును వృద్ధిచేయించి బొంబాయి దూది మరల యజ
మానులలో ముఖ్యులై వ్యాపారము నలుపుచున్న కాలమున జమ్సెట్జీ
తాతాగారు మఱియొక విషయమున గూడ మిక్కిలి శ్రద్ధవహింప
వలసివచ్చెను. ఈవిషయమునకూడ తక్కిన యజమానులును దొరత
నమువారును దూరదృష్టియు, దేశాభివృద్ధిదీక్షయు లేక విముఖులైనం
దున తాతాగారి ప్రయత్నమంతయు ప్రయోజనకారికాక వ్యర్థమయ్యె
ను. ఈవిషయము కార్మికసమస్యముతో సంబంధించినది. ప్రతిదేశము
నందును వివిధభాగముల స్వభావ మేకరీతిగనుండక భిన్నభిన్నముగనుం
డును. హిందూదేశమున నిట్టిభేదములు ప్రబలముగ నున్నవి. ఒక్క
ప్రాంతపు భూమియు ప్రజలును ఒక్కొక్క రీతిగనున్నందున పరస్ప
రానుకూల్య సాహాయ్యమువలననే దేశ మున్నతస్థితికి రాగలదు. వం

గ దేశప్రాంతము వ్యవసాయమునకు మిక్కిలి యనుకూలమగు ప్రదేశము. అచ్చటి జనులు విద్యావిషయములందును సాంఘిక ధార్మిక రాజ్యాంగ విషయముల చర్చించుటయందు నభిలాషముకలవారు బొంబాయి ప్రాంతము వ్యాపారమునకును యంత్రాలయ నిర్మాణమునకును ప్రసిద్ధికెక్కియున్నది. అచ్చటి జను లనేకులు వర్తకము వ్యాపారము చేయుట యందిచ్ఛగలవారు, పంజాబుప్రాంతము దృఢకాయులును ధైర్యసాహసవంతులును, యుద్ధాభిలాషులును, అగుజనులకుఁ బేరుఁజెందియున్నది. మదరాసుప్రాంతమునుండి రాజ్యాంగవిశారదులగు మంత్రులనేకులు వెడలిరి. ఇట్లు వివిధప్రాంతమందలి జనులు తమ ప్రాంతమునకు నైసర్గికమగు సంపత్తిని గుణములను వృద్ధిచేసికొని దేశమంతయు తమదిగనే భావించుచు పరస్పర సాహాయ్యము చేసిననే దేశమంతయు త్వరలో వృద్ధికి రాఁగలుగును.

1885 సంవత్సరము మొదలుకొని బొంబాయి ప్రాంతములోని యంత్రాలయములసంఖ్య ప్రతిసంవత్సరము వృద్ధియగుచుండెను. నూలుబట్టల యంత్రాలయమున నొక్కదానికి సుమారు వేయిమంది కూలి జనులు కావలసియుండెను. 1887 సంవత్సరమున బొంబాయి నగర ప్రాంతమునందే సుమారు 50 యంత్రాలయములు పని చేయుచుండినవి. దృఢశరీరులును, సమర్థులును, అగు కూలిమనుష్యుల యావశ్యకత యుండెను. బొంబాయిప్రాంతము పడమటి కనములను పర్వతములతోను, గుట్టలతోను నిండిన భూమియైనందున అచ్చట వంగదేశ సంయుక్తరాష్ట్రము లందుకన్న జనసంఖ్య తక్కువగా నుండెను. ఆప్రాంతమున వ్యవసాయము చేయఁబడు భూమిలో వరికన్న ప్రత్తి మొదలగునవి యధికముగా వేయఁబడుచుండును. గొప్ప నదు లధికముగా లేనందున డెల్టాభూములు లేవు. మొదట కొన్ని సంవత్సరములవఱకు ఆ ప్రాంతములందలి కూలిజనులే సరిపోవుచుండిరి. కాని మిల్లుల సంఖ్య

వృద్ధియైన కొలఁదిని కూలిజనుల గిరాకి యధికమయ్యెను. ఎంత హెచ్చుకూలి యిచ్చినను పనివాండ్రు దొరకుట దుర్లభమయ్యెను. గుజరాతు ప్రాంతమందలి అహమ్మదాబాదు మొదలగు స్థలములందు బట్టల యంత్రాలయములు స్థాపింపఁ బడుచున్నందున అక్కడ నుండియు కూలిజనులను దీసికొనివచ్చుటకు వీలు లేకపోయెను. స్వస్థానమునందు సుఖముగా జీవితము గడచిపోవుచున్నప్పుడు అన్యప్రాంతములకు వెళ్లుట జనుల కిష్టముగా నుండదు. ఈస్వభావము యితర దేశ జనులకన్న మన దేశీయులకు మిక్కిలి యధికముగానుండి యీజనప్రసిద్ధముగా నుండుచున్నది. యంత్రాలయముల భావిస్థితికి సులభముగా కూలిజనులు దొరకుట మిక్కిలి యావశ్యకము. కూలిజనులు దొరకుట మిక్కిలి కష్టముగా నున్నసమయములందు యజమానులు చెప్పినట్లు కూలిజనులు వినుటకు బదులు కూలిజనులు బెదరించినప్పుడెల్ల యజమానులే భయపడవలసి యుందురు. సమయమునకు రాకయు, సరిగా పనిచేయకయు ఇంకెన్నెట్టి దుష్ప్రవర్తన కావించినను సమ్మెకట్టు కట్టినను యజమానులసహాయులై శిక్షింపక మౌనము ధరింపవలసి వచ్చును. ఈసంగతి నంత నాలోచించి తాతాగారు మనదేశమందలి యితర ప్రాంతముల నుండి కూలిజనులను తీసికొనివచ్చుటకు ప్రయత్నములు చేయసాగిరి. ఉత్తర హిందూస్థానమందలి సంయుక్తరాష్ట్రము మిందుకు మిక్కిలి యనుకూలముగా నాయనకుఁ దోచెను. వేలకొలఁది సంవత్సరములనుండి నాగరికజనుల యావాసమై గంగా యమునాది నదులతో శోభించుచు విశాలమగు చదునునేలగల యీప్రాంతమునందలి జనసంఖ్య మిక్కిలి యధికముగా నుండుటయేఁ గాక అచ్చటిజనులు దక్షిణప్రాంతమునందలి జనులకన్న దృఢముగల దీర్ఘశరీరము కలవారుగానున్నారు. ఈజనులు పాటుఁబడు స్వభావముకలవారే ? పంటలు బాగుగానున్న సమయములందు తప్ప తక్కినకాలములందుఁ దినుటకు కాహారము లేక మిక్కిలి

కష్టపడుచుండిరి. యంత్రాలయములు మొదలయినవి లేనందున కూలిజను లధికముగనున్నను కూలిచేయించుకొను యజమానులు తక్కువ ఆకాలమున నచ్చటి కూలివాండ్రకు దినమునకొక యణాకన్న నెక్కువ దొరుకుటలేదు. దానితోనే తృప్తిజెంది జను లుపాయముతో జీవించుచుండిరి. బొంబాయి ప్రాంతమున దినమున కారణా తెచ్చినను కార్మికులు దొరకుట కష్టసాధ్యమగుచుండెను. అందువలన తాతాగారు అచ్చటనుండి కూలిజనుల తీసికొనివచ్చుట మంచిదని తలంచిరి. ఇట్లుచేసిన బొంబాయి ప్రాంతమునందలి యంత్రాలయముల పని సులభముగా జరుగుటయేకాక సంయుక్తరాష్ట్రమునందు దినమున కొక యణాయైనను దొరకక తినుట కాహారములేక చచ్చుచున్న జనులు సుఖజీవనముచేయుటయే క్రమముగా ద్రవ్యమును సంపాదింపవచ్చును. కాని యీకూలిజనుల స్వస్థలమునువిడచి దూరప్రదేశమగు బొంబాయిప్రాంతమునకుఁ బోవుట కష్టముగాఁ దోచెను. స్వాభావికమగు మనోదౌర్బల్యమువలనను, భీతివలనను, విద్యాగంధవిహీనులును, స్వగ్రామప్రాంతములనెన్నఁడును విడచియెరుగని పల్లెటూరిజనులపిరికితనమును, మూఢత్వమును పారఁదోలి ఉత్సాహమును ధైర్యమునుపుట్టించి వారలను బొంబాయికి వచ్చునట్లుచేయుట మిక్కిలి యావశ్యకమని తాతాగారు నిశ్చయించిరి. మన దేశమున మొగలుల రాజ్యము పోయిన తరువాత దేశము భిన్నములగు చిన్నరాజ్యములక్రింద విడిపోయి చిరకాలమువరకు రాజులకు పరస్పరయుద్ధమును, అశాంతియు, బందిపోటు భయమును వ్యాపించియుండుటచే జనులకు స్వస్థానమును విడచి యన్యస్థలమునకేఁగుట భయజనకముగ నున్నందున జనులకు మొదట నమ్మకమును, ధైర్యమును, కార్యశూరత్వమును కలిగించుట యవసరమయ్యెను.

స్వల్పసంఖ్యాకులగు జనులు దూరస్థలమందలి భిన్నభాషికులకు జనులమధ్య నివసింపుఁడని కొత్తమనుష్యులు కోరినప్పుడు పామరజను

లు శంకించుటలో నాశ్చర్య మేమియు లేదు. కాని దొరతనమువారు స్వయముగా చాలమంది జనులను రైలుపై తీసికొనిపోయి సుఖకరములగు గృహములను మంచి జీతమును యిప్పించి పనిచేయఁగోరిన వారు ధైర్యమును జేకూర్చుకొని బయలుదేరుటకు సందేహ ముండదు. కొందఱు కార్మికులు పోయి ద్రవ్యము సంపాదించి యక్కడి సుఖస్థితిని తిరిగివచ్చి స్వకీయమిత్రులతోఁ జెప్పినతరువాత దొరతనము వారి సహాయ మక్కఱలేకయే కూలిజనులు తమంతట రా నారంభింతురు. ప్రారంభమున దొరతనమువారి సహాయమును బొంబాయిలోని యంత్రాలయాధికారు లందఱును గలసి గృహములను కట్టి కూలిజనుల కుత్సాహమును బుట్టించి కూలిని తరుణమున నిచ్చుటయు నితరప్రోత్సాహములను జేయుటయు నావశ్యకములని టాటాగారు తలఁచిరి. అందుకై స్వదేశీమిల్లుసంఘమునకు ప్రతినిధులుగా టాటాసంఘమువారు బొంబాయియంత్రాలయముల ప్రస్తుతాభివృద్ధిని అందులకు కార్మిక జనుల యత్యంతావశ్యకతను క్షామబాధాపీడితులగు సంయుక్తరాష్ట్ర కూలిజనులను దొరతనమువా రిచ్చుటకు పంపుటకు సహాయము చేయుచో యంత్రాలయము లవిచ్ఛిన్నముగా వృద్ధియగుటకు మార్గ మేర్పడుటయే గాక సంయుక్తప్రాంతమునందలి కూలిజనులకు కొందఱకు సుఖజీవనము కల్గి మిగిలినవారికి క్షామబాధ తగ్గుటయు మొదలగు సంగతులను నిరూపించుచు సంయుక్తరాష్ట్రపు దొరతనమువారి కొక యర్జీని పంపిరి. బొంబాయిప్రాంతమునందు బట్టలమిల్లు లతివేగముతో వృద్ధియగుచున్న విషయము ను ముందుముందు నేలబొగ్గు కరువునకును, యితరదేశముల పోటీకిని తోడు కార్మికజనుల యభావమువలన మిల్లుల యజమానులకు కలుగఁబోవు బాధలను సంయుక్తరాష్ట్రమునుండి కూలిజనులను దొరతనమువారి సహాయమువలనఁ దెప్పించుటవలన యజమానులకును కూలిజనులకును కలుగఁగల సౌఖ్యమును వివరించుచు

వెంటనే సంయుక్తరాష్ట్రపు దొరతనమువారి సంఘము నీసహాయము కోరవలసినదిగా యంత్రాలయయజమానుల సంఘమునకు కొక లేఖ నుగూడ పంపిరి. దూరదృష్టిరహితులై యుండిన యంత్రాలయయజమానసంఘమువారు తాతాగారి లేఖయందలి సత్యమును, ఆవిషయమునందలి ప్రాముఖ్యమును, ముందుముందు రాఁబోవు కష్టములను గ్రహింప లేక కాలక్రమమున కార్మికసమస్యతమప్రయత్న మక్కఱలేకయే సరుకొని పోవుననియు, దానికై ప్రత్యేకముగాఁ బ్రయత్నించుట యనవసరమనియు జబాబు నిచ్చిరి. అందుపై సంయుక్తరాష్ట్రపు దొరతనమువారును ఉపేక్షచేసిరి. తరువాత కొలఁదిసంవత్సరములలోనే తాతాగారు వ్రాసినదంతయు సత్యముగా కనుపడి కార్మికసమస్యల వలన బాధపడుచుండినప్పుడు ప్రతియంత్రాలయాధికారులును తమ సంఘమువారైకమత్యము లేక కార్మికసమస్య సులభముగా పరిష్కరించుకొనగల్గు యదనును జారవిడచినందుకు మిక్కిలి విచారించుచు, తాతాగారి బుద్ధిసూక్ష్మతను, దూరదృష్టికిని ఆశ్చర్యపడుచు వచ్చిరి. ఐకమత్యవిహీనతవల్లనే బొంబాయి యంత్రాలయాధికారుల కనేకపర్యాయములు కష్టములు కల్గుచువచ్చెను. ప్రతిభావంతుల బుద్ధిసూక్ష్మతయు, భావిస్థితిపర్యాలోచనమును యితరసహచరులకు లేనందున అట్టి ప్రతిభాశాలురగు నాయకులకృషి కొంతవఱకు వ్యర్థమగుట తప్పనిలోకాచారమైనది. కాని అందువలన తరువాత తరములవారు జ్ఞానవంతులై యీసంగతుల గ్రహించి ప్రయోజనమును బడయవచ్చును. నూలు బట్టల వ్యాపారవిషయమున మఱియొక చర్చయందు జమ్సెట్జీ తాతాగారు హిందూదేశీయులకు నాయకత్వము వహించెను. మనదేశపు దొరతనమువారి ఆర్థికస్థితిలో కొన్నికష్టములు సంభవించి వ్యయమధికమై యాదాయము చాలనందున దొరతనమువారు మనదేశపు ఎగుమతిదిగుమతులపై 1894 యందునూటికయిదువొప్పునపన్ను విధించిరి.

మనదేశపుబట్టలపై అనేకవిధములగు పన్నులువేసి తుదకు ప్రభుత్వ శాసనపూర్వకముగ బహిష్కారము చేయించియు తమ దేశపు నూలుబట్టలవ్యాపారమును వృద్ధిచేసికొనినయాంగ్లులిప్పుడు కోట్లకొలది రూపాయల బట్టలను దిగుమతి చేయుచు అమితలాభమును సంపాదించుచున్నందున అట్టిలాభము తగుననియు వారల హిందూదేశమునందలి బట్టల పరిశ్రమయగు వృద్ధియగుచున్న భయకారణము కల్గియు తాముపంపు బట్టలపైనను, నూలుపైననుపన్నువిధించుట కష్టముగతోచి పార్లమెంటులో తమప్రతినిధుల మూలమునను, సభలమూలమునను ఆందోళనము చేసినందున యీబలత్కారమువలన లండనునందలిహిందూదేశ మంత్రిగారు నూలుబట్టలపై పన్నును తీసివేయించిరి. మన దేశపు దిగుమతులలో సగముకన్న నధికభాగము నూలుబట్టల దిగుమతులేయైయున్నందున వీటినితప్పించినందువలన యీపన్నువలని యాదాయము సగముకన్న తగ్గిపోయెను. ఈసంగతిని హిందూదేశములోని దొరతనమువారు ఆంగ్లదేశములోని తమయజమానులకు తెలియపఱచినాటికి మూడున్నరవంతున మాత్రమైనను నూలుబట్టలపై పన్నును విధించుట కనుమతిని కోరిరి. హిందూదేశములోని దేశీయయంత్రశాలాధికారులకు ఈపన్మాత్రమైన తమకన్న నధిక సదుపాయముకలుగు సందర్భమును సహింపలేని లంకషైరు వ్యాపారుల యభీష్టమునకు వ్యతిరేకముగా చేయఁజాలని హిందూదేశయంత్రములపై తయారగునూలుబట్టలపైనకూడ 3½వంతున పన్నువిధించు షరతుపై అట్టిపన్నునువిధింప నిచ్చిరి. 20వ నంబరులోని నంబరునూలుబట్టలపై మాత్రమీపన్నువేయఁబడదు. మనదేశమునందలి యంత్రశాలలయందు తయారుచేయఁబడి మనదేశపుజనులచేతను కొనఁబడునూలు బట్టలను చవుకగాచేయించుటకు సహాయము చేయకపోవుటయేగాక మీఁదుమిక్కిలి అందుపై పన్నునుకూడ విధించి వ్యాపారమునకు ప్రజలకును కష్టమునుక

లుగఁ జేయుట ఇదివరకే దేశమునను కనిపించియుండని విషయమనియు యిదిమిక్కిలి యన్యాయమనియు మనదేశపు వ్యాపారనాయకులు చింతించి దొరతనమువారి కీవిషయమును తెలియఁజేసి న్యాయమునుబడయుటకు తాతాగారిని, ఎస్. వాడీయాగారిని తమ ప్రతినిధులనుగా నియోగించిరి. వీరిద్దఱు నీవిషయమును మొదట యిండియా దొరతనమువారికి విశదపఱచిరి. కాని కలకత్తాలోని యిండియా దొరతనమువారి కిది యన్యాయమని తెలిసియేయున్న ఆంగ్లదేశమందలి యధికారుల యాజ్ఞకు భిన్నముగా వర్తింపఁజాలనందున తా మెట్టిసహాయమును చేయఁజాలమని జవాబునిచ్చిరి. అంతట తాతాగారు ఆంగ్లదేశమునకుఁబోయి అచ్చటహిందూదేశము మంత్రిగారితో చర్చించిరి. లంకషైరునుండి హిందూదేశమునకు వచ్చుబట్టలపై పన్నువిధింప బడునప్పుడు యిందలిమిల్లు బట్టలపై పన్నువసూలు చేయుటకూడ న్యాయమేయని మార్లిను ప్రభువుగారు సెలవిచ్చిరి. ఆంగ్లదేశమునఁ ఖర్చు అగుయింగ్లీషు మిల్లుబట్టలపై దొరతనమువా రెట్టి పన్నును విధించుటలేదు. ఆంగ్లుల వ్యాపారోద్యమము బాగుగా వృద్ధిజెంది ప్రపంచమందలి యన్నిప్రాంతములతోను నిరభ్యంతరము పోటీకి నిలువఁబడి ప్రపంచమందలి వ్యాపారమున నగ్రస్థానము వహించువఱకును ఇండియా మొదలగు యితరదేశముల నుండి తమదేశమునకు దిగుమతి యగుచున్న బట్టలవ్యాపారము పూర్తిగ నశించువఱకును ఆంగ్లప్రభుత్వము వారు తమదేశపువ్యాపారులకు ద్రవ్యరూపమునను మఱి వివిధములగు నితరమార్గములను అమూల్యమగు సహాయము చేయుచు వచ్చిరి. ఆంగ్లదేశపు కార్మికజనులును, వ్యాపారనాయకులును విద్యావంతులగుటయే కాక వ్యాపారమునందును, యంత్రాలయములునడుపుటయందును ఆరితేరినవారు. హిందూదేశపు యంత్రాలయములును, వ్యాపారములును నూతనముగా నుత్పన్నమై యిప్పుడిప్పుడే వృద్ధికి రాఁబోవుచున్నవి. ఆంగ్లదేశమునందువలె

శాస్త్రీయవిద్య గలవుటకు సాంకేతికవిద్యాలయములును, కర్మాగారములును విశేషముగా లేవు. ఆంగ్లదేశపు కూలిజనులు మిక్కిలి దృఢగాత్రులును, శీతలదేశమున నివసించువారును అగుటచే హీనబలులై ఎండవేడిమిచే సులభముగా నలసట్టెందు భారతీయకార్మికుల కన్న నెక్కువ బాగుగా పని చేయఁగల్గుదురు.

ఆంగ్లదేశము కోటీశ్వరులగు వర్తకులుకలదై భాగ్యముతోఁ దులదూఁగుచున్నది. అందువల్లనే నచ్చట గొప్పగొప్ప యంత్రాలయములను స్థాపించుటయు, నడపుటయు సులభము. హిందూదేశ మిప్పుడు దారిద్ర్యదేవతకు నిలయమైనందునను స్వల్పసంఖ్యాకులగు ద్రవ్యవంతులు వ్యాపారవిషయములందు శ్రద్ధవహించుట గౌరవలోపముగాఁ దలఁచుటచేతను, యంత్రశాలలకొఱకు సమృద్ధిగా ద్రవ్యము దొరకదు. హిందూదేశమునందు నూలుబట్టలయంత్రశాలలను స్థాపించుటకు కావలసిన యంత్రములును ఉపకరణముల నన్నిఁటిని నేలకొలఁది మైళ్లదూరమున నున్న ఆంగ్లదేశమునుండి తేవలసియున్నందున ఇచ్చటి యంత్రశాలానిర్మాణమునకు అచ్చటికన్న వ్యయము చాల యధికమగును. అవి యంత్రములకుఁ గావలసిన నేలబొగ్గు ఆంగ్లదేశమున సమృద్ధిగాను చౌకగాను దొరకును. బొంబాయిప్రాంతమున నట్టిసదుపాయము లేకుండెను. అందువలన లంకషైరుతో హిందూదేశమునకు పోటీ కలిగి అందువలన లంకషైరువారికి నష్టముకల్గుట యనునది కల్లోని వార్త. మఱియు ఆంగ్లదేశీయులు రెండుమూఁడు తరములనుండి 60, 80 నెంబరుకు క్రిందివగు ముతకనూలును మానివేసి సన్ననూలును బట్టలును మాత్రమే తయారుచేసి పంపుచున్నారు. మనదేశమునందు సాధారణముగా ముతకనూలును బట్టలును మాత్రమే సిద్ధముచేయఁబడుచున్నవి. అందువలన హిందూదేశపు పోటీవలన ఆంగ్లవ్యాపారమునకు నష్టము కల్గుట యసత్యము. మనదేశపుబట్టలపై

యీపన్నును విధించుటవలన జపాను, చీనా మొదలగు దేశములందలి ముదకబట్టలను పంపు వ్యాపారస్థులతో పోటీకి నిలువలేక బొంబాయి ప్రాంతమందలి వ్యాపారులు నష్టము పొందుచున్నారు. మనదేశపు బీదలు కట్టుబట్టలు ప్రియమగుటకుఁగూడ నీపన్ను కారణమగుచున్నది. ఈవిషయము లన్నిటిని తాతాగారు వివరించిచెప్పి యీపన్నును వేయుట కేవలమన్యాయమని నివేదింపఁగా హామిల్టనుగారు హిందూదేశపు యంత్రాలయాధికారులకు మంచి లాభము వచ్చుచున్నదనియు అందువలన యీపన్నువలన వారికి హానికలుగదనియు జవాబునిచ్చిరి. అంతట తాతాగారు హిందూదేశపు వ్యాపారులకు నూటికైదుకన్న నెక్కువ లాభములేదనియు, ఇచ్చటి రివాజుగానున్న వడ్డీకన్న యీలాభ మధికముకాదనియు, ఇంతకన్న నాంగ్లదేశీయులకే మిక్కిలి యధికమగు లాభము వచ్చుచున్నదనియు, స్పష్టపఱచిరి. ఈవిషయముపై నిదర్శనమును హామిల్టను ప్రభువుగారు కోరినందున తాతాగారు బొంబాయికివచ్చిన వెంటనే ముఖ్యులగు యంత్రశాలాధికారుల నుండి తమతమ లెఖ్ఖలను తెప్పించి జమాఖర్చులను పట్టీలక్రింద నుదహరించి ఖర్చులన్నియుపోను నూటి కారుపాళ్ళుమాత్రమే గిట్టుబడియగుచున్న సంగతిని విశదీకరించి యాపత్రపుప్రతులను హామిల్టనుప్రభువుగారికిని యచ్చటి యంత్రశాలాయజమానులకును పంపిరి. అయినను హిందూదేశపు బట్టలవ్యాపారము వృద్ధియగుట కిష్టములేకయు యిచ్చటి యంత్రశాలవలన హిందూదేశమునుండి ప్రతిసంవత్సరమును తాము పొందుచున్న కోట్లకొలఁదిరూపాయల లాభమెన్నటికైనను తగ్గిపోవునేమోయను ఈర్ష్యాసూయాగ్రస్థులగు వ్యాపారుల బలాత్కారముచే ఆంగ్లమంత్రులీపన్ను విధింపనియమించినందున మనదేశీయులవాద మరణ్యరోదనమయ్యెను.

అందువలన తాతాగారి ప్రయత్నమువలన ఆంగ్లానేకారులకును ప్రజలకును యీపన్ను వేయుట అన్యాయమని తెలిసినను ప్రెస్టుటుప

తము లేకపోయెను. రెండు మూఁడు సంవత్సరములక్రింద ఆంగ్లదేశాధికారులకు యుద్ధమున 150 కోట్ల రూపాయల ద్రవ్యము నుచితముగా నిచ్చుటకై హిందూదేశపు దొరతనమువారు తమ యాదాయము నభికముచేయ యత్నించి నప్పు డీవిషయము మఱల తీక్ష్ణమగు చర్చకు వచ్చెను. ఇచ్చటి యంత్రముల సరకులపై పన్ను వేయుటవలన లంకషైరులోని ఆంగ్లవ్యాపారులకు సహాయ మేమియు లేకపోవుటయే కాక మనదేశపు యంత్రశాలలు సరిగా వృద్ధికాక జపానుదేశపు పోటీకి తాళలేక పోయినందున హిందూదేశపు బట్టలవ్యాపారము చాలవఱకు జపానీయుల చేతులలోఁ బడుచున్నదనియు ఇందువలన ఆంగ్లవ్యాపారులకుఁ గూడ నష్టము వచ్చుచున్నదనియు స్పష్టమయ్యెను. అందువలన హిందూదేశపు యంత్రముల బట్టలవ్యాపారము తగ్గినను తమ కేమియు ప్రయోజనము లేదనియు తమకు ముందుముందు అమెరికా దూదితో నన్నని బట్టలను, నూలును, తయారు చేయుటను నేర్చుచున్న జపాను వ్యాపారులతో పోటీ యధికమగునని తుదకు తాముపంపిన యెగుమతులపై వేయునంత పన్నును హిందూదేశపు బట్టలపై వేయ నవసరము లేదని యొప్పుకొనిరి. అయినను దొరతనమువారికీపన్నులవలన మంచి యాదాయము వచ్చుచున్నందున పన్నును తీసివేసి యాదాయమును తగ్గించుటకుఁ బదులుగా యీపన్ను నట్లేయుంచి దిగుమతియగు సరకులపై పన్ను నధికము చేయుటకు దొరతనము వారంగీకరించిరట ?

---

## ౫వ అధ్యాయము.

మన భరతఖండమున ననేక శతాబ్దములనుండి పట్టుబట్టలు ధరింపఁబడుచున్నవి. ఇవి దూది బట్టలకన్న నెక్కువ మన్నికఁ గలవి. ...దముగాను, విలువఁ గలవిగాను యుండుటయేఁ గాక యెక్కువ పవి

తక్కువ ధరకైనవిగా కూడ భావింపఁబడుచుండుట యందఱకును తెలిసిన విషయమే. అందువలన వందలకొలఁది సంవత్సరములనుండి మనదేశమున పట్టునూలును తీసి దానితో బట్టలు నేయువ్యాపారము దూదిబట్టల వ్యాపారమువలెనే వంశానుగతముగా వ్యాపించియున్నది. ఈబట్టలను మన దేశమునందే కాక విదేశములందుఁ గూడ గొప్పపేరుఁ గలిగియున్నది. కాని దూది బట్టలవలెనే పట్టుబట్టలను కూడ మనదేశమునుండియుఁ జీనానుండియు, కొని యుపయోగపరచుకొనుచుండిన యూరపుఖండపు జనులలో 18 శతాబ్దమున గొప్ప మార్పుఁగలిగెను. స్వదేశాభివృద్ధిఁగోరు యచ్చటి నాయకులయొక్కయు, గొరతనమువారియొక్కయు, సాహాయ్యమున నచ్చటనే బట్టలు తయారగుట యారంభింపగనే మనదేశపు దిగుమతులు నిలిచిపోయి యుతర దేశములనుండి మన దేశమునకు పట్టుబట్టలు విరివిగా పంపఁబడ నారంభించెను.

మన దేశమున రాజ్యక్రాంతియు, అశాంతియు వృద్ధియైనకొలఁదిని రాజాదరణమును, జనాభిమానమును లేకయు విదేశముల పోటీలకు నిలువలేకయు పట్టుబట్టల పరిశ్రమయు వేగముగా క్షీణింపఁదొడగెను. దూదిబట్టల విషయమునవలె పట్టుబట్టలుకూడ మన దేశమున పురాతనపద్ధతుల ప్రకారమే తయారు చేయఁబడుచుండ యూరపుఖండపు దేశమునందు నూతనానుభవమును బట్టి మంచిపట్టుతో నెక్కువ ప్రశస్తమైన బట్టలు చక్కగా నేయఁబడుట ప్రారంభింపఁబడెను. పట్టు ఒక విధమైన కాయలనుండి తీయఁబడు మెత్తనిదూదివంటి పదార్థము పట్టుకాయ ఒక విధమగు పురుగు తన నివాసముకొఱకు కట్టుకొనుఁ గూఁడు. ఈపురుగు మల్బరియను నొకవిధముగా ఆకులనుతిని జీవించును. అందువలన దీనిముఖ్యాహారమగు మల్బరి తోటలు బాగుగా పెరుగుచోట పట్టుపురుగులు గూడులుగట్టుకొని నివసించును. ఈగూడు బాగుగా పెద్దదైన తరువాత సాధారణముగా దానిని వేడినీళ్లలో

వేసి లోనిపురుగును చంపి అంచలిపట్టును జనులుతీయుదురు. మన దేశమున మల్బరిక్రియాకులనే తినుపురుగులు కలవు. కొన్ని దేశములందు యితరవస్తువులను గూడ దినుపట్టుపురుగులు కలవు. ఫ్రాంసు, ఇటలీదేశములందలి కొందఱు నాయకులచే చీనాదేశము నందలి పట్టుపురుగులు ఫ్రాంసు, ఇటలీదేశములందు పెంపఁబడ నారంభించెను. అప్పటి నుండియు నీదేశమునందు పట్టు వ్యాపారము శీఘ్రకాలముననే వృద్ధి నొందెను. ఆపట్టుపురుగులను మన దేశమునఁ గూడ పెంచుటకుఁ బ్రయత్నములు సలుపఁబడెను. గాని వానికాహారములగు మొలకలు మన దేశమున పెరుగనందున ఉత్తమమగుపట్టు మనదేశమున వృద్ధిగా వ్యాపించుట లేదు. జమ్సెట్జీ టాటాగారు చీనా, జపాను దేశములకుఁ బోయి నచ్చటచ్చటి జనులు పట్టుపురుగులను పెంచుటకై తోఁటలను వృద్ధిచేయుట కచ్చటి జను లవలంబించు పద్ధతులను పరీక్షించివచ్చి మైసూరు ప్రాంత మీవిషయమున మిక్కిలి యనుకూలముగా నున్నసంగతిని కనిపెట్టి అచ్చట పట్టువ్యాపారమును వృద్ధిచేయుటకు మైసూరుదొరతనమువారి సెలవును తీసికొనెను. టాటాగారిచే ప్రారంభింపఁబడిన పట్టు పరిశ్రమ శీఘ్రకాలముననే మైసూరునందు వృద్ధిఁజెంద నారంభించెను. మైసూరు ప్రభుత్వము టాటాగారికి స్థల సహాయము మొదలగువాని మూలమున సహాయ మొనరించిరి. ఆతోఁటలో బయలుదేరు పట్టు యిప్పుడు మంచి లాభము నిచ్చుచున్నది. టాటా కంపెనీ వారు మైసూరులోపట్టుపరిశ్రమను, వ్యాపారమును నేర్చుకొనఁదలఁచు విద్యార్థులకు తమ తోఁటలయందును, కర్మాగారములయందును, ఉచితముగ నావిద్యను నేర్పుదురు. అందుకై మైసూరు ప్రభుత్వము వారి కంపెనీకి సంవత్సరమునకు మూఁడువేల రూపాయలను బహుమానముగా నిత్తురు. చీనా, జపాను, అమెరికా, ఫ్రాంసు మొదలగు వివిధ దేశములందు వ్యాపారవృద్ధిఁ గొఱకుఁ బ్రయాణము చేయుచుండి నప్పుడు

తాతాగారు దేశములందలి వ్యాపారవిషయములనే కాక వారి యితరాభ్యాసములను కూడ పరీక్షతోఁ జూచి అందలి విశేషములను వినోదముతో గమనించి నేర్చుకొనుచుండిరి. ఈశిప్తు, అమెరికాలోని ప్రత్తి వ్యవసాయపద్ధతులను చీనా, జపాను, ఫ్రాన్సు, ఇటలీ దేశములలోని పట్టు వృద్ధికి జను లవలంబించు రీతులను తాము స్వయముగా నేర్చుకొని యుండిరి. ఇదిగాక తాతాగారికి తోఁటలయందు చాలఁ బ్రీతి. తమ స్వగ్రామమగు నవసారియందు విశాలమగు భూమియందుఁ జక్కని తోఁట నొకదానిని వేయనారంభించిరి. ప్రతిపర్యాయమును హిందూదేశమందలి దక్షిణభాగములే కాక యితర దేశములకుఁ బోయి వచ్చినప్పుడెల్ల ఆయాదేశములందు తమకు ఆకర్షకములు కాఁబడిన ఉపయోగకరములగు వివిధ పుష్పఫల వృక్షములు అంటులను, విత్తనములను తెప్పించి తమ తోఁటలో నాఁటి వృద్ధిఁ జేసిరి. ఇట్లు క్రమముగా వృద్ధిఁ జెందిన యీ యారామ మిప్పుడు ప్రపంచమందలి మంచి వృక్షము లనేకములు కలిగినదై యమూల్యమైనదిగా నెంచఁ బడుచున్నది. ఆయన పెద్దకొమారుఁడగు దొరాబ్జి తాతాకూడ తండ్రివలె మఱియొక మంచితోఁటను పూనానగరమందలి తమ భవనముచుట్టును పెంచి వృద్ధిఁ జేసియున్నాఁడు. ఈతోఁటఁగూడ దాని యుపయుక్తతకును శోభకును గొప్ప పేరుఁగల్గియున్నది. జమ్సెట్జీ తాతాగారు ప్రారంభించిన వ్యాపారము లన్నిటివలనను ఆయనకు చాల లాభము వచ్చెను. కాని ద్రవ్యార్జన మొక్కటియే యాయన ముఖ్యోద్దేశముగాదు. తాము చేయు వ్యాపారము లాభకారియై యితరులకు మార్గదర్శకమై యుండుటయును, చాలమంది కూలిజనులకుఁ బ్రతుకు తెరవునిచ్చుటయే కాక జనసామాన్యమునకు మిక్కిలి యుపయోగకరమును సౌభాగ్యవహమును న్నైన దేశక్షేమమున [illegible]మైనదిగా నుండుటయే యాయన ముఖ్యోద్దేశము.



బొంబాయినగరమునందు వ్యాపారమును, యంత్రశాలలును వృద్ధియై జనసంఖ్య దినదినమును వృద్ధియైనకొలఁదిని పట్టణమునందు చోటుచాలక చాలపేటలు క్రొత్తవి నిర్మింపఁబడుచుండెను. కాని కర్మాగారములందలి కూలిపనికొఱకు మూఁగుచున్న కూలిపనివాండ్రు పేదలై యుండుటచే మిక్కిలి యిరుకైన గుడిసెలందు నివసించుచుండిరి. గుడిసెల చూరు క్రిందికి వంగియుండి లోపల కిటికీలు మొదలైనవి లేనందునను వంటయును, నిద్రయును, పిల్లలనివాసమును చీకటితోను తేమతోను మిక్కిలి యనారోగ్యకరమైన యాక్షుద్రకుటీరమునందే గడుపవలసియున్నందున వీరలలో వ్యాధులు మిక్కిలి శీఘ్రముగా వ్యాపింపనారంభించెను. నివాసములకు యోగ్యములగు గృహములు నిర్మించుకొనుటకు కూలిజనులు ద్రవ్యవంతులు కాకపోవుటయే గాక వారు విద్యావంతులు కాకపోవుటవలన నారోగ్యవిషయములు వారలకుఁ దెలియనందున వారల కారోగ్యమును కాపాడుకొనుటయందు శ్రద్ధ కలుగదయ్యెను. బొంబాయి కలకత్తా మొదలగు మహానగరములందు అమెరికా యింగ్లండు దేశముల పద్ధతిని యంత్రశాలలు శీఘ్రముగా వృద్ధినొందినకొలఁదిని ఆముఖ్యనగరమునందు నివసించుచున్న కూలిజనుల క్షేమము నారయుట మిక్కిలి యవసర మయ్యెను. కార్మికుల యారోగ్యము చెడి వారు దురభ్యాసములకు లోనగుటవలన వారలలో ననేకవిధములగు వ్యాధులు జనించి ఆవ్యాధులు దేశమంతటను వ్యాపించుటయే గాక అందువలన కూలిపనికిని వ్యాపారమునకును నిరోధము కలిగి యంత్రశాలాధికారులకుఁ గూడ చాల నష్టము సంభవించెను. కూలిజనులు సౌఖ్యోత్సాహవంతులుగా నున్నచో యంత్రశాలల పని బాగుగా జరుగుటవలన యజమానులకును మంచి లాభము కల్గును. అందువలన టాటాగారు తమ కూలివాండ్రు నివసించుట కనురూపముగానుండి సమృద్ధిగా వెలుతురును గాలియును వచ్చునట్లును

యిసుకను తేమయు లేకయుండునట్లును పరిశుభ్రము లగు చిన్న
కుటీరములుగల పేటలను నిర్మింపఁజేసి అందు మిక్కిలి తక్కువ
అద్దెలపైఁ గూలివాండ్రు కాపుర ముండుట కేర్పాటు చేసెను. ఈ
కుటీరములమధ్యను వారిబాలకులు విద్య నభ్యసించుటకు ప్రాథమిక
విద్యాలయమును వైద్యశాలయు నిర్మింపఁబడెను. తాతాగారి కుటీర
పద్ధతి మిక్కిలి యనుకూలముగానుండుటచే నితరయంత్రశాలాధికారు
లలో కొందఱు ప్రముఖులుగూడ కూలిజనులకు సౌఖ్యారోగ్యకరము
లగు కుటీరముల నిర్మింపఁజేసి నివాససౌకర్యమును కలుగఁజేసిరి.

తమ ప్రయాణములలోఁ బ్రపంచమందలి వివిధనాగరికదేశము
లందలి జనుల నివాసగృహములను తాతాగారు వినోదార్థము విమర్శన
తోఁ బరీక్షించుచుండిరి. జపానుదేశమున నొకవిధమున నొకరీతిగాను,
ఇంగ్లండు మొదలగు దేశములందు మఱియొకరీతిగాను, అమెరికాయం
దింకొకవిధముగాను అనేక విధోపకరణములతో గృహములు నిర్మింపఁ
బడి యుండెను. మనదేశపు ధనవంతుల గృహములు సాధారణముగా
నితరదేశములందున్న నెక్కువద్రవ్యము ఖర్చుచేసి కట్టఁబడినవైనను
లోనికి గాలియును వెల్తురును వచ్చుటకు వీలులేక క్రిక్కిరిసి మిక్కిలి
యనారోగ్యకరములుగా నుండును. అచ్చటి వీధులుకూడ వైశాల్యము
లేక మురికినీరు పోవు మార్గము లేకుండుటచేత అనారోగ్యము మఱింత
యధిక మగుచున్నది. ఈ భవనములు చూచుట కెంత సుందరములు
గాఁ గనుపడినను అవి ఆరోగ్యమున కనుకూలములుగను యీభవనము
నకు ఖర్చుపడిన ద్రవ్యమునకుఁ దగినంత యుపయోగము వానివలనఁ
గలుగదు. హైదరాబాదు మొదలగు పూర్వకాలపు నగరములలోని భ
వనములు చాలవఱకీరీతిగనే యుండును. సాధ్యమైనంత తక్కువ ద్ర
వ్యముతో ఉన్నతజాతి జనులు నివసింపఁదగిన చక్కని గృహములను
కట్టించుటకు ప్రారంభించి బొంబాయినగరమునం దట్టిభవనము లనే

ములను కట్టించెను. ఈగృహములు మిక్కిలి సౌఖ్యకరమగుటయే గాక మిక్కిలి యందముగాకూడ నున్నవి. వీనిలోనెల్ల ముఖ్యమగు తాజ్ మహాల్ హోటల్ అను ప్రాసాదరాజము బొంబాయినగరములోని మహాభవనము లన్నింటిలో నగ్రగణ్యమై ఐరోపీయులు మొదలగు అన్నిజాతులవారిచేతను మిక్కిలి ప్రశంసింపఁబడుచు తాతాగారికి పేరు మోస్పదమైన బొంబాయినగరములోని ముఖ్యదర్శనీయస్థానములలో నొకటియై యున్నది. పార్సీజాతీయులు ద్రవ్యార్జనమునకే కాక కష్టార్జితమగు ద్రవ్యమును విద్యావైద్యాదిసత్కార్యములకొఱకు దానముగా నిచ్చి సద్వినియోగము చేయుటయందు మనదేశమున మిక్కిలి ప్రసిద్ధికెక్కియున్నారు. తాతాగారు వారిలోని ప్రముఖులలో నొకరు. నూలుబట్టల యంత్రాలయములవలనను యితరవ్యాపారములవలనను ఆయనకు ప్రతిసంవత్సరమును లక్షలకొలఁది రూపాయల ఆదాయము వచ్చుచుండెను. అందలి చాలభాగమును అనేక దానధర్మముల కొఱకు నిచ్చివేయుచుండిరి. కాని తాతాగారికి గుప్తదానమే యిష్టముగానుండుటవలన వారేయేధర్మకార్యముల కెంతెంత ద్రవ్య మిచ్చినదియు నెవ్వరికిని బూర్తిగాఁ దెలియదు. దేశక్షేమార్థము ప్రారంభింపఁబడిన ప్రతిసత్కార్యమునకు ఆయన తప్పక ద్రవ్యసహాయము చేయుచుండెను. బొంబాయినగరమందలి వైద్యశాలలు, విద్యాలయములు మొదలగు అనేక జనోపయోగస్థలముల కాయనవలనఁ జాల సహాయము కలిగెను. బీదలగు విద్యార్థులనేకులు తాతాగారివలనఁ బోషింపఁబడుచుండిరి. కాని నిజముగా బీదలును, మాంద్యరహితులును అగు జనులుమాత్రమే సహాయమును బొందుచుండిరి. దుస్స్వభావము కలిగి మోసముతో ననేకనామముల ధరించి యాచనకువచ్చు వంచకులు తాతాగారివలన పరాభవమును బొంది పోవుచుండిరి. విద్య జనులలో నెంతయధికముగా వ్యాపించిన యంతత్వరలో సంఘము బాగుపడఁగ

లను. కనుక విద్యార్థులకు సహాయముచేయుటయన్న తాతాగారికి మిక్కిలి ప్రీతికరముగ నుండెను. నిరంతరవ్యాపారమగ్నులగు తాతాగారికి సాంఘిక రాజకీయాదిసమాజములందుండి కృషిచేయుటకు కాలము చాలకపోయినను వానిని స్థాపించుటకు, వృద్ధినొందించుటకును తమ సానుభూతిరూపము ధారాళముగా ద్రవ్యసహాయపురూపమునను ఆ సమాజనాయకుల కుత్సాహమును కల్గించుచుండిరి. కార్యశూరతయే తాతాగారికి ముఖ్యసూత్రముగా నుండెను. తాము పనిచేసి కనఁబరచుటవలనను స్నేహితులతో సంభాషించునప్పుడు వారి కనేక నూతన విషయములను తెలిపి వారి కనేకోద్యమములవిషయమై తమ యభిప్రాయమును తెలియఁజేయుచు వచ్చిరి. ఈసంభాషణములందు తాతాగారిచే చెప్పఁబడుచు వచ్చిన వృత్తాంతములు క్రొత్తసంగతులును మిక్కిలి వినోదకరములుగాను, ఉపయోగకరములుగా నుండి యుండెను. అంతితరదేశములనుండి మనము గ్రహింపవలసిన విశేషము లిమిడియుండెను. కాని యీసంభాషణములు లిఖితరూపముగఁ బ్రకటింపఁబడకపోవుటచేతను, తాతాగారికి సభలయం దుపన్యసించు ఆచారము లేకపోవుటవలనను, అందలి సంగతులు స్థిరరూపమునఁ దాల్పక నశించిపోయెను. తాతాగారు హిందూదేశ జాతీయసభయందుగాని, వివిధ సంఘములందుగాని యెన్నఁడును ఉపన్యసింపకపోయినను రాజకీయవిషయములందలి ముఖ్యాంశము లన్నియు ఆయనకు బాగుగాఁ దెలిసియుండెను. ఆయన యభిప్రాయములు మెహతా వాచా మొదలగు జాతీయనాయకుల యభిప్రాయములకన్న తీవ్రతరములుగా నుండెను.

జాతీయమహాసభకు విశేష ద్రవ్యసహాయము చేయుటయేగాక తాతాగారు బొంబాయిరాష్ట్రీయ సంఘమును స్థాపించిన ప్రముఖులలోనొకరుగా నుండిరి. అర్థశాస్త్రమును స్వతంత్రముగా నభ్యసింపకపోయినను ఆర్థికప్రపంచమునను, వ్యాపారమునను ఆయ[illegible] కల[illegible]

భవము యితరహైందవు లెవ్వరికిని లేకయుండెను. అందువలన ఆర్థిక సమస్యలను గూర్చి టాటాగారి యభిప్రాయములు సర్వజనులునుగౌర వింపదగినవిగా నుండెను. ఆర్థిక రాజకీయాది విషయములను గూర్చి టాటాగారును భారతీయ రాజ్యాంగ వేత్తల నాయకుడగు దాదాబాయినౌరోజీగారును యేకాభిప్రాయులై యుండిరి. దాదాబాయి నౌరోజీగారి విశాలహృదయమును యద్భుతమేధను, రాజకీయపరిజ్ఞానమును ఆంగ్లదేశీయులు చూచిమిక్కిలి మెచ్చుకొని భారతీయుడైనను ఆయన నుపార్లమెంటులో తమప్రతినిధులలో నొకరినిగా నెన్నుకొనిరి. పార్లమెంటు సభయందు నౌరోజీగారు తమజ్ఞానవైభవమునను, సాహోద్దమువలనను వక్తృతాచాతుర్యమునను ఆంగ్లప్రజాప్రతినిధులలో ననేకుల కుహిందూదేశక్షేమము నందాభిముఖ్యమును కలుగజేసిరి. ఆసమయమునందు మనదేశమును గూర్చియనేక విషయములు చర్చింపబడుచుండెను. హిందూదేశములోని సివీలుసర్వీసు ఉద్యోగములకై చేయబడు పరీక్షప్రతిసంవత్సరమును ఆంగ్లదేశములోని లండనునగరమునందు మాత్రము జరుగుటవలన అతిదూరమగుటచే వ్యయప్రయాసముల భరింపలేకయు, ఆచారవ్యవహార ప్రతిబంధములవలనను భారతీయులలో బుద్ధిమంతులీపరీక్షకు రాలేకపోయినందున ఈపరీక్ష హిందూదేశము నందుగూడ ఏకకాలముననే జరుపుట నిష్పక్ష పాతముగాను, న్యాయముగాను ఉండునని దాదాబాయి నౌరోజిగారు తమయాంగ్ల మిత్రులతో తెల్పిరి. ఈవిషయము ప్రజాసభయందు చర్చింపబడి ఆసభచే ననుమోదింపబడెను. కాని ఆవిషయమంతటితో నిలచిపోవుటయు, దొరతనమువారు అన్యాయమైనను న్యాయమైనను ఆపరీక్ష లండనునగరమున మాత్రమే జరుగవలయునని పట్టుపట్టినందున ప్రజాసభవారి తీర్మానము వ్యర్థమయ్యెను.

పార్సీలలోను, మఱికొన్ని యితర హైందవజాతులలోను సము

ప్రయాణముచేసి యాంగ్లదేశమునకుఁ బోయి అన్యదేశ సంబంధమగు బాధల నన్నిటిని భరించి ఆంగ్ల యువకులతో పోటీకి నిలచి సివిలుసర్వీసు పరీక్ష నిచ్చుటకు మన దేశపు విద్యార్థులు కొంద రిష్టపడినను వారు ద్రవ్యహీనులై నిరాశులు కావలసివచ్చెను. ఇట్లే సివిలుశాఖ యందేఁగాక యింజినీరింగు, వైద్యము మొదలగు యితరశాఖలందుఁ గూడ నీచోద్యోగములతో తృప్తిఁబొందక స్వదేశము నందున్నతోద్యోగముల యందపేక్ష కలవారు విదేశములకుఁ బోయి విద్య నభ్యసింపవలసి యున్నందున భాగ్యవంతులు కాని విద్యార్థులకు మార్గము లేక పోయెను. పాశ్చాత్యదేశములందలి నాగరికతకు ముఖ్యకారణమగు ప్రకృతిశాస్త్రజ్ఞానమును, సాంకేతిక విద్యయు మన దేశమున లభ్యమగుటకు యిచ్చటి జనులలో బుద్ధిమంతులు కొందఱు విదేశములకుఁ బోయి ఆయాశాఖల యందలి యున్నతవిద్యను నేర్చుకొనివచ్చుట మిక్కిలి యావశ్యకమయ్యెను. స్వయంకృషివలన మనము సాధింపఁగలిగినంత వఱకు యత్నించి కృతకృత్యులగుట ధర్మమని తలఁచు తాతాగారు యిచ్చట కొంతవఱకు సామాన్య విద్య నభ్యసించి యున్నతవిద్యకై యాంగ్లదేశమునకుఁ బోదలఁచు యువకుల సహాయము కొఱకుఁ గొంతద్రవ్యమును మూలధనముగా నేర్పఱచి దానిమూలమున ప్రతిసంవత్సరమును ఇద్దఱు విద్యార్థులను విదేశమున విద్యనభ్యసించుటకుఁ బంపనియమించెను. ఈఫండునకు ట్రస్టీలు నియమింపఁ బడిరి. ప్రతిసంవత్సరమును హిందూదేశమునందలి విశ్వవిద్యాలయ పట్టపరీక్షలలో నెందైనను చక్కఁగా కృతార్థులై విదేశమున నింకను ఉన్నత విద్య నభ్యసింపఁదలచు దరఖాస్తుదారులలోనుండి యిద్దఱు యెన్నుకొనఁబడుదురు. వీరిప్రయాణపు ఖర్చులును విదేశములందు వీరువిద్య నభ్యసించుటకగు వ్యయమును యీఫండునుండి ట్రస్టీలు భరింతురు. తరువాత వీరు తిరిగి వచ్చి దొరతనమువారి యుద్యోగమునందు తాతాకంపెనీ క్రిందగా

ని మఱియొకవిధముననైన సంపాదించు వేతనాదాయమునుండి కొంచె ముకొంచెముగా తాము ఫండునుండి పుచ్చుకొనిన ద్రవ్యము నంతను తీర్చివేయవలసి యుండును. అందువలన విద్యార్థులకు స్వయంకృషి యందు విశ్వాసము కలుగుటయేకాక ఫండు యెన్నటికిని తగ్గిపోకుండుటచే శాశ్వతముగా నీసహాయము విద్యార్థులకుఁ గలుగుటకు సందేహముండదు. ఇట్లు సహాయమును పొంది కొందరాంగ్లదేశమునను కొందర మెరికాయందును, యితరులు జపానుదేశమునను తమకభిమతమగు విద్య నభ్యసించి వచ్చి అనేకవిధములగు ఉన్నతోద్యోగములందు పని చేయుచున్నారు. సుమారు యేబదిమందిభారతీయు లీ టాటా ఫండు సహాయమున విదేశములందు విద్యనుపొంది అందువలనసులభముగా ఉన్నతోద్యోగములకు రాగలిగిరి.

---

## ౭ వ అ ధ్యా య ము.



తమ దూది యంత్రశాలలు మొదలగువానిని తమయనుచరులే స్వయముగా నడపుటకుఁ బ్రారంభించినది మొదలుకొని అనఁగా సుమారు 1895 నుండి జమ్సెట్జీ టాటాగారు దేశోపయోగకరములగు అనేక నూతన పరిశ్రమల పైనను, యితర వ్యాపారముల పైనను మనస్సును మరల్చి వానినిగూర్చి ఏకాగ్రముగా నాలోచింప నారంభించిరి. ఇతరదేశములందు ప్రయాణముచేయుచు తాము గ్రహించుచువచ్చిన అనేక నూతన విషయములను, వానిని గూర్చి తమ యమూల్యాభిప్రాయములను జమ్సెట్జీ టాటాగారు తమ కార్యదక్షులగు బిల్లిమోరియా బెజోంజిదాదాభాయి బర్జోర్జి పాద్షాలకును, తమ మిత్రులగు సస్సూన్ డేవిడ్ స్యామలదాస్ మొదలగు వారికిని తెలియజేయుటయేఁగాక తమ పుత్రులగు దొరాబ్జీరత్నతాటాలకుఁగూడ నీ నవీన విష

యములను చక్కఁగ శోధించి తమయూహలను, వానిని కార్యక్రమ మునకుఁ దెచ్చుమార్గమును వారికినేర్పిరి. మన దేశపు యభ్యున్నతికై తాతాగారవలంబించిన యీపద్ధతి యెంతయో యుపయోగకరమాయ్యెను. తరువాత తాతాగారు నిర్ణయించుకొనిన వివిధపరిశ్రమలను, దేశోపయోగకరములగు యితర సంస్థలను పూర్తిగా స్థాపింపఁబడి వృద్ధినొందుటకుఁ బూర్వమే జమ్సెట్జీ తాతాగారు విదేశయాత్రచేయు సమయమున దైవదుర్యోగమున హఠాత్తుగా మరణించుట సంభవించెను. వీరి మరణమువలన మనదేశమునకు సంభవించిన హాని యపారమనుటకు సందేహము లేదు. కాని తమ యంత్య సమయమునందును జాగ్రత్తతో తమ కుమారులను, మిత్రులను, తమయాలోచనలందును, కార్యక్రమమంతయు పూర్తిగా పాల్గొనునట్లు చేయుటవలన వారిమహా వ్యాపారములు వారితో నశింపక పిమ్మట నైక్యపరిపాలన దీక్షగల కుమారులచే మిత్రసాహాయ్యమున తండ్రిగారి యుద్దేశముచొప్పున నెరవేర్పఁబడెను. వీరివిషయమున 'ఆత్మావైపుత్రనామాసి' అను వేదవాక్యమంతత సార్థకమయ్యెను. జమ్సెట్జీ తాతాగారి సంస్థాపనములు వారితోనే నశింపక వారేర్పఱచిన పద్ధతులప్రకారమే వ్యాపింపఁగల్గుటకు వారి పుత్రుల నిరంతరకృషియు, మిత్రులసాహాయ్యమును ముఖ్యకారణములయ్యెను. తాతాసంఘమువారిచే నిప్పుడు నడుపఁబడు పరిశ్రమ లనేకములు గలవు.

ఇవియన్నియు జమ్సెట్జీ తాతాగారికాలమునందే వృద్ధినొందకపోయినను వానిని స్థాపించు ఉద్దేశ సాధనసంపత్తులు వారికాలమునందే సిద్ధముచేయఁబడెను. తాతాసంఘమువారిచే స్వభాషయగు గుజరాతియందును ఆంగ్లభాషయందును, బొంబాయిప్రాంతమందు వార్తాపత్రికలు రెండు మూఁడు నడపఁబడుచున్నవి. ఇందుముఖ్యముగా వార్తలుప్రకటింపఁ బడుటయేగాక, రాజకీయసాంఘిక వ్యాపార విషయములుచక్క

గాఁ ప్రతిదినమును చర్చింపఁబడును. టాటాకంపెనీవారిచే బహిష్కారోద్యమముఁదొకటి రెండు సంఘములు స్థాపింపబడి కాలువలు చేయుట మొదలగు కార్యములందు శ్రద్ధవహించుచున్నవి. టాటాకంపెనీవారి ముఖ్యవ్యాపారము బొంబాయియే యైననువారిచే స్థాపింపఁబడువానిలో నేయే వ్యాపారముల కేయేప్రాంత మనుకూలమో యారాష్ట్రములందు నెలకొల్పబడుచున్నవి. అందువలన నాయాయుద్యములుతప్పక జయశీలములగుటయేకాక హిందూదేశమందలి వివిధప్రాంతము లందలి జనులు వానిలాభములను పొందఁగల్గుదురు. విశేషమూల ధనమును పెట్టి ఉత్సాహముతో యంత్రశాలలను స్థాపించుమహాసీయులు కొందఱు తమవ్యాపారము చక్కఁగావృద్ధినొందఁదగు స్థానమునుగూర్చి బాగుగా పరిశీలింపక తమకనుకూలముగా నుండునంతమాత్రమున తమనివాసస్థానముననే యంత్రశాలలను స్థాపించి నందున కొన్నియుద్యమములు వృద్ధినొందుటకు బదులుక్షీణదశకు వచ్చుట సంభవించెను. పదాన్యవరులలోనొక్కఁడై దేశభక్తనాయకుఁడై హిందూదేశపున్యాయవాదిశిరోమణియగుశ్రీరాసవిహారిఘోషుగారిచే స్థాపింపబడిన'వందేమాతరం'నిప్పుపెట్టెల యంత్రశాల కలకత్తానగరమున నుండుటచే విదేశపుపోటీయధికమయ్యెను. అదియే సముద్రతీరమునకాక హిందూదేశ మధ్యమునందలి యడవుల సమీపమున నుండెనేని పోటీతగ్గుటయేకాక విదేశపువస్తువులను దేశమధ్యమునకు తెచ్చుటకగు రైలు చార్జి దీనికక్కఱలేనందున తక్కువ కిమ్మత్తున కమ్ముటకు వీలుకల్గును. కార్మికుల కీయవలసినకూలి కలకత్తావంటి మహానగరములకన్న జనపదములందు తగ్గియుండును. అందువలన టాటాకంపెనీవారు తమపరిశ్రమలను సాధ్యమైనంతవరకనుకూలములగు స్థానములందే స్థాపించుచున్నారు. ఇందుకొన్ని మైసూరువంటి దేశీయసంస్థానము లందును, మరికొన్ని బహిష్కారము మొదలగురాష్ట్రము లందును ఉన్నవి. దూరదృష్టిసంప

న్నులును దేశీయక్షేమాభిలాషులును నిరంతర కృషిదక్షులును అగుజ మ్సెట్జీ తాతాగారు నగమునగముగాపడచిన మరికొన్ని వ్యాపార ప రిశ్రమములను సంస్థలు వారిపుత్రులచే మిత్రసాహాయ్యమున అచిరకాలముననే అభివృద్ధి నొందింపఁ బడినవి. ఇందుకొన్ని తక్కినవాని కన్న మిక్కిలి ముఖ్యములగుటయేగాక దేశీయపురోభి వృద్ధికిని పారిశ్రామిక జీవనమునకును అత్యంతావశ్యకములై నవి. అందు ప్రకృతిశాస్త్రపరిశోధ నాలయమునకును, అయఃపరిశ్రమకును, జలవిద్యుచ్ఛక్తి పరిశ్రమకును కావలసిన పరిజ్ఞానమును సామగ్రి జమ్సెట్జీతాతాగారే సంపాదించిరి. కాని వానిని పూర్తిగా స్థాపించుకార్యమే వారు కీర్తిశేషులైరి. పారిశ్రామిక ధనాగారము సాంకేతిక విద్యాలయము నావికానిర్మాణము, నారికేళపరిశ్రమ మొదలగువానిని స్థాపించు ఉద్దేశము తాతాగారికి కల్గియుండినను వానిని గూర్చిపూర్తిగా నిర్ధారణ చేసి సాధనసంపాదనము చేయుటకు జమ్సెట్జీగారి జీవితకాలమునందు వ్యవధిలేకపోయెను. నూతనోద్యమములకు వలయుసామగ్రిని పూర్తిచేయు సంకల్పముతోను, నిరంతరక్లేశమునఁ జెడిన తమ యారోగ్యమును బాగు చేసికొను తలంపుతోను, జమ్సెట్జీ తాతాగారు 1904 జనవరి యందు బొంబాయి నగరమును విడచి యూరపుఖండమునకు బయలుదేరిరి. అప్పుడు తాతాగారు కొంచెము స్వస్థముగానున్నను హానికరమగు వ్యాధి లేనందునను తాతాగారి మనస్థైర్యమును బట్టియు స్వల్పకాలముననే విదేశయాత్రను పూర్తిఁజేసి మఱల జన్మభూమిని చేరఁగ ల్గుదురని బంధుమిత్రులందఱునుఁ దలఁచియుండిరి. ఐరోపాఖండమును చేరిన వెంటనే ఆయనకు కళత్రవియోగము సంభవించి యీయాత్ర ప్రయత్నముద్రమునుండి వీరు మఱలఁ దరిఁజేరలేకఁ బోయిరి. మే మాసమునందు జర్మనీ దేశమునకు వచ్చిరి. 19 వ తేదియందు నౌహీం అను గ్రామమున తాతాగారు కాలధర్మము నొందిరి. జ్యేష్ఠ తనయుఁడగు

దొరాబ్జి తాతాయును సహజమిత్రుఁడగు రత్నతాతాయును మాత్ర ము చెంతనుండిరి. అకస్మాత్తుగ తటస్థించిన వీరి మరణమును గూర్చి నవార్త వెంటనే హిందూ దేశమంతటను వ్యాపించి దేశీయుల నందఱిని శోకసాగరమున ముంచివేసెను. మరణకాలమునకు వీరి కరువదిమూ డేండ్లుఁ గలవు. భారతీయుల ప్రస్తుతకాలపు జీవితపరిమాణమును బట్టి యిది యకాల మరణమని చెప్పుటకు వీలులేదు. మరణమునకుఁ బూ ర్వము కొన్ని నెలలవఱకు వీరి యారోగ్యము చక్కఁగా నుండెను. ఇంక ననేక నూతన వ్యాపారములను గూర్చి వీరాలోచనము సల్పుచుండిరి. పార్సీలలో దాదాభాయి నౌరోజీవంటి జాతీయ రాజ్యాంగనాయకులు ను, సర్. జమ్సెట్జీ జీజీభాయివంటి వ్యాపార నాయకులును తొంబది యేండ్లకుపైవఱకు జీవించియుండిరి. ఆకారణమున పొట్టిగానున్నను వీ రి శరీరము దృఢముగానుండి నిరంతరశ్రమనువహుట సాధ్యముగానుం డెను. బొంబాయి వదలువఱకును జమ్సెట్జీగారు వ్యాపార కార్యముల నుత్సాహముతో నిర్వర్తించుచునే యుండిరి. బొంబాయి ప్రాంతమం దలి వ్యాపార నాయకుల కందఱికిని తాతాగారు ప్రముఖులుగా నుం డిరి. ఆయన సహాయమును సలహాను వార మూల్యముగా భావించు కొనుచుండిరి.

మన దేశపు పురోభివృద్ధికి పారిశ్రామిక వ్యాపార వ్యాప్తియే ముఖ్యాధార మైనందునను, జమ్సెట్జీ తాతాగారి యంతటి ప్రతిభావం తులగు వ్యాపార నాయకులు మన దేశమున నింక నెవ్వరును లేనందు నను యీశోకవార్తను విన్నప్పుడు దేశీయుల మనములందుఁ గలిగిన దుఃఖమునకు మేరలేకఁ బోయెను. దేశమందలి ముఖ్యనగరము ల న్నిటియందును జనులు సభలనుచేసి అందు తమశోకమును వెలిబుచ్చిరి. వారిలో తాతాగారికిఁ బ్రియపాత్రమై, వారి జీవితమునందలి వివిధ కార్యములకు ముఖ్యస్థానమైన బొంబాయి నగరమందలి పౌరులఁ బ్రో

త్సాహమున నగరాధ్యక్షుఁ డొక గొప్పసభ చేసెను. అంతకుఁ బూర్వ మిందుల కై చిన్నసభ లనేకములు చేయఁబడినను తాతాగారు మరణించి యప్పటికిఁ బది నెల లైనను ఈసభకుఁ గూడ వేలకొలఁది జనులు వచ్చిరి. బొంబాయి గవర్న రగు లమింగ్టను ప్రభువు సభాధ్యక్షుఁ డయ్యెను. హైకోర్టు ముఖ్య న్యాయాధిపతిగా నుండిన సర్. లారెంసు జెంకిన్సు, సర్. జమ్సెట్జీ జీజీభాయి, సర్. దిన్షా పెటిట్, సర్. ఫిరోజేషా మెహతా, దిన్షా వాచా, సర్. కోవాన్‌జీ జహంగీర్ మొదలగు పార్సీప్రముఖులును సర్. బాలచంద్రకృష్ణ సరోత్తమదాస్, గోకులదాస్ చందావర్కార్ మొదలగు హిందూ నాయకులును బదరుద్దీన్ త్యాబ్‌జీ, ఫజుల్భాయి కరింభాయి మొదలగు మసల్మాను ముఖ్యులును నరోస్సాన్ జేపిడు మొదలగు జ్యూనేతలును డాక్టరు మక్కిచాన్ వెస్లీ మొదలగు ఆంగ్ల ప్రధానులు యిట్లన్ని జాతుల ప్రతినిధులును వచ్చి సభ నలంకరించిరి. అప్పుడు తాతాగారి బుద్ధిసూక్ష్మతను, నిరంతర కృషిశాలిత్వమును, వ్యాపారనైపుణిని, నిర్మలమనస్సు, విశాలహృదయము, ఔదార్యదాతృత్వములను, ఆడంబరరహితత్వమును, నిగ్రహమును, అపార దేశాభిమానమును, బీదలయందలి సానుభూతిని, శాంతస్వభావమును, గర్వాభావమును గీర్తించుచు ముఖ్యన్యాయమూర్తి యగు సర్ లారెంసు జెంకింసు ప్రజానాయకులగు మెహతా త్యాబ్జీ, బాలచంద్రకృష్ణ మాక్కిచాన్ మొదలగు నాయకు లందఱును ఉపన్యసించిరి. మన దేశమందలి యంత్రశాలలును, వ్యాపారమును వృద్ధిచేయుటకు తాతాగారు చేసిన కృషియు, విద్యాభివృద్ధికిని, ఆరోగ్యవైద్యశాలలకును ఆయన చేసిన విధానములును, మన దేశపు భావిమహత్వమును గూర్చి ఆయన కుండిన యమితోత్సాహమును, దేశసేవానిరతియు ఆసభయందు వర్ణింపఁబడెను. తరువాత బొంబాయి నగరమందు స్థిరమగు తాతా జ్ఞాపిక నొకదాని స్థాపించుటకును మానవేశ్వర ... తీర్మా



నము చేయఁబడి అందుకై 47 వేల రూపాయలవఱకు పైగా చందాలు వేయఁబడెను. ఈద్రవ్యముతో బొంబాయినగరమందలి ప్రధానవీధు లలో నొకచోట జమ్సెట్జీ తాతాగారి శిలాప్రతిమను కట్టింప నిశ్చయిం పఁబడెను. అట్లు చేయింపఁబడిన చక్కని శిలాప్రతిమ బొంబాయి జి. ఐ. సి. రైల్వేకంపెనీవారి భవనములయెదుట 1912 ఏప్రిలుమాస మున అప్పటి బొంబాయిగవర్నరుగా రగు సిడెన్హాం ప్రభువుగారిచేఁ దె రువఁబడి తద్దర్శనార్థమై వచ్చిన బొంబాయిలోని సకలజాతిప్రముఖుల కు నానందదాయక మయ్యెను. ఈప్రతిమ తాతాగారి వివిధమహాకా ర్యములకు స్మారకమై భారతీయుల మానసవీధియందు హిందూదేశపా రిశ్రామికాభివృద్ధిని చిత్రింపఁజేయుచు దేశీయులనందఱను స్వయంకృ షికి ప్రోత్సాహమునుఁ గల్గించుచుండును.

---

## 2 వ అ ధ్యా య ము.

ప్రస్తుతకాలమున నాగరిక దేశములలో ముఖ్యములగు ఇంగ్లం డు, జర్మని, సంయుక్తదేశము, జపానులకుఁబోయి ఉన్నతవిద్య నభ్య సించి యువకులు వెఱలివచ్చి మన దేశమున గొప్ప యుద్యోగముల నూలమునినో, దేశము సేవఁ జేయుటకు వీలుకల్గుటకై జమ్సెట్జీతా తాగారు ప్రతిసంవత్సరమును బీదలగు యువకుల కిద్దరకు సహాయము చే యనొక ఫండుస్థాపించి యుండుట మనకు తెలిసియేయున్నది. ప్ర స్తుతము నాగరికాగ్ర గణ్యములుగా నున్న యీదేశములు రెండువం దల సంవత్సరము లలో తమకన్న ననేక శతాబ్దములనుండి యధికనా గరికమును, బలవత్తరమును అగు మనహిందూదేశముతో కలసికొను టయేకాక అంతకన్న నధికధన, బల, విద్యా, వ్యాపారసంపన్నములగు టకు మూలకారణము ఆదేశములు విద్యాంసులను, జ్ఞానాభిలాషులు

ను, ప్రకృతిశాస్త్రమున చేసినకృషియు అందువలన వారుసంపాదించి నజ్ఞాన విశేషమునే యనుటకు సందేహములేదు. పూర్వము౽తర దేశములందుకన్న మనదేశమున ప్రకృతి శాస్త్రము లధికశ్రద్ధతో వ్యాసంగము చేయఁబడు చుండినను కాలక్రమమున నది క్షీణించి పోయెను. అందుతోఁబాటు మనదేశపు ఆధిక్యముకూడ తగ్గిపోయి వైద్య, రసాయన, గణిత, జ్యోతిశ్శాస్త్రాది వివిధవిద్యల కాకరమై యుండినమనదేశమిప్పుడు మూఢవిశ్వాసముల కాశ్రయమైనది. పాశ్చాత్య దేశపువిద్యావంతులు మనదేశమునుండి కొంతవరకు గ్రహించియు, కొంతవరకు తాముస్వయముగా కృషిచేసియు, తమశాస్త్ర జ్ఞానమునుక్రమక్రమముగా వృద్ధిచేసి కొనిరి. తమదేశముల నుండి ప్రాకృతికమగు అజ్ఞానాంధకారము పారఁదోలఁబడి చిరకాలము తనప్రభచే తేజోవంతముగ చేసి జ్ఞానసూర్యుఁడు మనదేశమునుండి యప్పుడే యస్తమించుతరుణమును కనిపెట్టి మనదేశమును తనకు నివాసస్థానముగ చేసికొనెను. పాశ్చాత్య దేశములందు ప్రకృతి శాస్త్రజ్ఞానము దినదినాభివృద్ధినొంది యనేక నూతనావిష్కరణములకు కారణ మయ్యెను. ప్రకృతిశాస్త్ర సహాయముననే భూమిలో నగాధముగా నెవ్వరికని తెలియకుండ ననేక శతాబ్దములనుండి యేర్పడియున్న నేలబొగ్గు మొదలగు వివిధ ఖనిజములు పైకితీయఁబడినవి. ఆవిరి యంత్రము కనిపెట్టఁబడినది. రైలుమార్గములు వేయబడినవి. నావికాయాత్ర మిక్కిలిసులభమైనది. గొప్పగొప్ప యినుపయంత్రములు చేయఁబడినవి. నవీనవిధములగు యంత్రశాలలు వృద్ధినొంద పారిశ్రామిక వ్యాపారమంతయు పూర్తిగా మారిపోయినది. విద్యుచ్ఛక్తి కనుగొనఁబడి అందుమూలమున ప్రపంచము నందలి అనేకనూతన వ్యాపారములును, ఉపకరణములును, బయలుదేరినవి ఆశ్చర్యకరములగు నూతనావిష్కరణములు దినదినమును చేయఁబడుచున్నవి. బైసికలు, మోటరుబండి, స్టీమ

రు, రైలు, ఆకాశవిమానము, మొదలగు నూతన యానము లనేకములు బయలు వెడలినవి. వైద్యశాస్త్రమునందు క్రొత్త సంగతులు కనుగొనఁబడినవి. యుద్ధ సంబంధమగు నూతనీయ యంత్రము లనేకములు సృజింపఁబడినవి. వాస్తువిద్య యంతయు చాల పరిణామము బొందినది. వీనికన్నిటికిని ప్రకృతి శాస్త్రమున కావింపఁ బడినజ్ఞానాభివృద్ధియే ముఖ్యకారణము. ప్రకృతి శాస్త్రజ్ఞానమున నధికవృద్ధిగాంచి నదేశము లిప్పుడు ప్రపంచము నందధిక నాగరికత కలవిగాను అధిక బలవంతములుగాను ఉన్నవి. 19వ శతాబ్దమున నితర దేశములకన్న వ్యాపారాదు లందాంగ్ల దేశము గొప్పదగుటకా దేశపు ప్రకృతి శాస్త్రజ్ఞానాభి వృద్ధియే కారణము. ఈశతాబ్దమున నిందుమూలముననే జర్మనిదేశము ప్రముఖతఁ గాంచి నాలుగున్నరసంవత్సరములు నాగరికప్రపంచమునంతెను యుద్ధమున నిరోధింపఁ గల్గెను.

ప్రకృతిశాస్త్రవిద్వాంసుల సహాయముననే తుదకు అమెరికా మొదలగు దేశముల సేనలు జర్మనుసేనల యౌద్ధత్యము నడుపఁగలిగినవి. ప్రస్తుతకాలమున వ్యవసాయమునఁగాని, వ్యాపారమునఁగాని, సైనికబలమునగాని దైనికకార్యములందుఁగాని, ప్రకృతిశాస్త్రజ్ఞాన మత్యంతావశ్యకము. అందు నూతనవిశేషములను గనిపెట్టుటకై నిరంతరమును కొందఱు శాస్త్రపారంగతులు పరిశోధన చేయుటకూడ మిక్కిలి యవసరమై యున్నది. సకలవిధాభివృద్ధికిని మూలాధారమగు ప్రకృతిశాస్త్రపరిశోధనకై విదేశములకుఁ బోవుట వ్రియప్రయాసము లతోఁ గూడుకొన్నదగుటచే మనదేశముననే అట్టి పరిశోధనాలయము నొకదానిని స్థాపించుటకు జమ్సెట్జీ టాటాగారు నిశ్చయించుకొనిరి. ఇందుకై ఇంగ్లండు, జర్మనీ, అమెరికాలలోని ముఖ్యశాస్త్రకళాశాలలకును, పరిశోధనాలయములకును బోయి వానిని జక్కఁగాఁ బరీక్షించి అందుల విశేషములను గమనించి అందు వేనిని మనదేశమున స్థాపిం

చుటకు వీలుకల్గునో కనిపెట్టుటకు బర్జోర్జీపాద్షాయను గొప్పపరీక్షలందుత్తీర్ణుఁడై సూక్ష్మబుద్ధియై సమర్థుఁడగు నొక పార్సీయువకుని నియమించి పంపెను. ఆవశ్యకమగు ఈ గవేషణమునకును అందుకై పాశ్చాత్యశాస్త్రజ్ఞానులలోని ప్రధానుల యభిప్రాయములను, గైకొనుటకును కొంతద్రవ్యమును ఖర్చుపెట్టుటయే గాక రెండుమూడు సంవత్సరములు చాల కృషి చేయవలసివచ్చెను. తరువాత నీవిషయమును శోధించి శాస్త్రాలయమును అనుకూలమగు స్థానమున స్థాపించుటకును, అందులకు కావలసిన ఉపకరణములును, ద్రవ్యమును మదింపువేయుటకును తాతాగారు కొందఱు మిత్రులను సంఘముగాఁ జేర్చి యాపనిని నెరవేర్పించిరి. అంతట తాముసిద్ధముచేసిన ప్రక్రియను, అందులకై తామీయఁదలఁచిన 30 లక్షలరూపాయల విలువఁగల స్థిరాస్తి వివరమును తాతాగారు 1898 వ సంవత్సమున హిందూదేశపు దొరతనమువారికిఁ దెలియఁజేసి దానిని సరిగా జరిగించుటకు వారి సహాయమును కోరిరి.

అప్పటినుండియు నీసంస్థానమున కనేక విఘ్నములు కలిగెను. దొరతనమువారు తాతాగారి దేశభక్తిని, దాతృత్వమునుఁ బొగడుచు తమ సలహానిచ్చి సహాయముచేయ నంగీకరించిరి. కాని యనేక విషయములనుగూర్చి సందేహములను సూచించిరి. తుదకు 1903 సంవత్సమున రాజప్రతినిధియగు కర్జనుప్రభువుగారు తాతాగారిచ్చిన యాస్తిని కిన్మ్సకట్టి పరిశోధనాలయమును స్థాపించుటకువలయు యితర వివరములను పరిశీలించుట కుద్యోగస్థుల నియమించిరి. తాతాగారు దానముచేసిన గృహములపై అప్పటికి సంవత్సరమునకు 1¼ లక్షల రూపాయలుమాత్ర మాదాయము వచ్చునని లెక్కవేయఁబడెను. పరిశోధనాలయమునకై యాద్రవ్యము చాలనందున యింకను కొన్ని లక్షలు మందిరనిర్మాణాదులకై వ్యయము చేయవలసియుండునని దొరతనమువారు 1906 సంవత్సరమునఁ బ్రకటించిరి. అప్పటికి జమ్సెట్జీ తాతా

గారు కాలధర్మము నొందియుండినందున యజమానులలో అభిప్రాయ భేదములు కల్గెను యాజమాన్యము తమకుఁ గల్గినను పూర్తిగా ద్రవ్య సహాయము జేయుటకు హిందూదేశ ప్రభుత్వమువారు సిద్ధపడరైరి. అంతేకాక పరిశోధనాలయ స్థానమునుగూర్చి కూడ యేకాభిప్రాయము లేకపోయెను. జమ్సెట్జీ తాతాగారు తమ హిందూదేశములోని పురవరములలో నగ్రగణ్యమై, తమకు జీవిత కార్యమునకు ముఖ్యరంగమై, ప్రేమపాత్రమై శీఘ్రాభివృద్ధినొందుచు 10 లక్షల జనసంఖ్యకలిగి, యనేక విద్యాలకు, విద్యార్థులకు నునికిపట్టుగానున్న బొంబాయినగరము నందే యీపరిశోధనాలయమును పెట్టుటఁ దగియుండునని సూచించియుండిరి. అందువలన వ్యాపారులకును పరస్పర సహాయముకలుగును. బొంబాయి ద్వీపమునకు సమీపమునందున్న ట్రాంబాయి యను ద్వీపమున నుంచుట కొకసారి తీర్మానింపఁబడెను. కాని యాచిన్న లంకయందు స్వచ్ఛోదకము లేనందునను, చుట్టును సముద్రజలము మాత్రమున్నందునను, మంచినీళ్లు పరిశోధనాదులకును, జన నివాసమునకును మిక్కిలి యావశ్యకమైనందున ఆప్రయత్నము విడువ వలసి వచ్చెను. కొన్నిసంవత్సరములుచర్చజరిగిన తరువాత 1909 వ సంవత్సరమున నీ యాలయమును మైసూరు రాజ్యమునందలి బెంగుళూరునందు నుంచుటకు నిశ్చయింపఁబడెను. ఈనగర మున్నతమగు పీఠ భూమిపై నున్నది. అచ్చటి శీతోష్ణస్థితి పరిశోధనమున కావశ్యకమగు మానసిక శ్రమకు మిక్కిలి యనుకూలమై యారోగ్యకరమై యుండును. జలసమృద్ధికలదు. ఈనగర మింగ్లీషువారి పరిపాలనముననే యుండి మైసూరులోని బ్రిటిషు రెసిడెంటున కధీనమైయుండును. బెంగుళూరు, బొంబాయివలె గొప్ప గొప్ప పరిశ్రమలకును, వ్యాపారములకును ముఖ్యస్థానము కాదు. కోటీశ్వరు లనేకులు నివసించునట్టి పురమును కాదు. అంతటి జనసంఖ్యయు లేదు.

కర్ణాట రాజ్యమునకు నాయకమణిగానుండి యీపురవరము దినదినాభివృద్ధిఁ జెందుచున్నది. మైసూరు విద్యార్థుల కీపరిశోధనాలయము వలన చాల ప్రయోజనము గలుగును. గనుక శ్రీ మైసూరు మహారాజాగారు పరిశోధనమందిరమునకు గావలయు స్థలమును సంపాదించుటకుఁ గాను అయిదు లక్షల రూపాయల ద్రవ్యమును విరాళముగానిచ్చిరి. మన దొరతనమువారు భవన నిర్మాణాదులకై వెంటనే 2 లక్షల రూపాయలను తరువాత మూఁడు సంవత్సరములలో 1½ లక్షలను ఇచ్చుటకు సమ్మతించిరి. ఇంక ననేకోపకరణములు కావలసియుండెను. ఈసంస్థను జరుపు యాజమాన్యము కొంతవఱకు దొరతనమువారి యధీనమై యున్నది. పరిశోధన చేయించుటకుఁ గొందఱాంగ్ల దేశీయులు ముఖ్యోపాధ్యాయులుగా నుండుట యావశ్యక మనియు వారికి మిక్కిలి హెచ్చుజీతము లీయవలసి యుండుననియు, తీర్మానింపఁబడెను. ఈవ్యయము లన్నిటికై సంవత్సరమునకు రెండు లక్షల రూపాయల వఱకుఁ గావలసి వచ్చెను. తాతాగారిచ్చిన స్థిరాస్తిపైవచ్చు ఆదాయము కాక యింకను అవసరమగు ద్రవ్యమునిచ్చు భారమును హిందూదేశపు దొరతనమువారును, మైసూరు దొరతనమువారును తమపై సమానముగాఁ బంచుకొనిరి. తాతాగారు తమజీవితకాలమున దీనికి తగునధ్యక్షునికొఱకు 'సర్ విలియంరామ్సే' మొదలగు ప్రకృతిశాస్త్రపారంగతులగు పాశ్చాత్యవిద్వాంసులతో నాలోచించి ట్రావెర్స్ అనునొకగొప్ప ప్రకృతిశాస్త్రపండితుని కీయధికారము నీయనిశ్చయించిరి. ఇందు ముఖ్యముగా మూఁడు శాస్త్రశాఖలందు పరిశోధన చేయుటకు నిశ్చయింపఁబడెను.

1. వైజ్ఞానిక సాంకేతిక విద్య
2. వైద్యశాస్త్రము
3. తత్వశాస్త్రము మొదలైనవి.

దీనికి హిందూదేశ పరిశోధనాలయము అని నామకరణము కావింపఁబడెను.

1910 వేసవి కాలమందు కార్యక్రమము ప్రారంభింపఁ బడెను. కాని కొలఁది కాలముననే స్వతంత్రాభిప్రాయులును, జ్ఞానాభివృద్ధి బద్ధమనస్కులును, అగు ట్రావెర్సుగారికిని, దొరతనమువారి యభీష్టమునకు భిన్నముగా సంచరింపని యజమాన సంఘమునకును అభిప్రాయభేదములుకలిగి ట్రావెర్సుగారు పరిశోధనాలయమును విడువ వలసినవారైరి. తరువాత దీనికి యజమానులైన సర్. ఆల్ఫ్రెడ్ బౌగారు మద్రాసు రాష్ట్రపు దొరతనమువారి విద్యాశాఖకు ప్రవర్తకులై యుండి ఉపకారవేతనము నందుకొనుచుండిన వారు. వీరి యధికారకాలమున మందిర నిర్మాణాదుల యాధిక్యమేగాని పరిశోధనాభివృద్ధి యతిమందమయ్యెను. తాతాగారి యౌదార్యమునకుఁ దగినంత యుపయోగ మీపరిశోధనాలయము వలన కలుగకఁ బోవుటకుఁ గారణమేదియో సరిగాఁ దెలియదుఁగాని అట్లుండుట భారతీయులకు మిక్కిలి విచారకరమగువిషయము. తాతాగారింకను కొన్నిసంవత్సరములు జీవించియుండినచో దీని పరిస్థితి కొంతవఱకు భిన్నముగానుండి యుండవచ్చును. వారిపట్టుదలవలన ఉపయోగకరమగు నీశాస్త్రవిద్యాలయము గొప్ప వ్యాపారస్థానమును విద్యాధికులకును, విద్యార్థులకును, నివాసస్థానమగు బొంబాయి నగర ప్రాంతముననే స్థాపింపఁబడి యుండవచ్చునని జమ్సెట్జీ తాతాగారి జ్యేష్ఠపుత్రుఁడగు దొరాబ్జి తాతాగారభిప్రాయము నిచ్చిరి. తాతాగారింకను జీవించియుండినచో దీని యజమానసంఘమున దొరతనము వారికన్న ప్రజానాయకుల కేఁ బలుకఁబడి యధికముగా నుండెడిదని యు మన మూహింపవచ్చును. ముఖ్య వ్యాపార స్థానమై విద్యార్థుల యావాసమగు మహానగరమున స్థాపింపఁబడి భారతీయుల యాజమాన్య మధికముగానున్న మఱియొక శాస్త్ర పరిశోధనాలయము యొక్క

చరిత్ర మీసందర్భమున దృష్టాంతముగా మనకు స్మరింపఁదగియున్నది. వంగదేశమునందు స్వదేశీ యాందోళన ముత్పన్నమై యుండినప్పుడు తమప్రాంతమున ప్రకృతిశాస్త్రములందుచ్చవిద్యను నేర్పుటకును, పరిశోధనలఁ జేయుటకును ఒక విద్యాలయము మిక్కిలి యావశ్యక మని యచ్చటి విద్యాధికనాయకులకుఁ దోఁచెను. అప్పుడుకలిగిన యుత్సాహమునకు తాతాగారి మహాదానముగూడఁ గొంత సహాయకారి యయ్యెను. అందుకై కలకత్తాలోని న్యాయవాది నాయకులలో నొకరగు కీర్తిశేషులైన సర్. తారకనాథపాలిత్‌గారు 15 లక్షల రూపాయలను న్యాయశాస్త్రపారంగతులును, దేశభక్తులును, విద్యాభిమానియునగు సర్. రాసవిహారిఘోషుగారు 10 లక్షల రూపాయలను కలకత్తా విశ్వవిద్యాలయమునకు ప్రకృతిశాస్త్రమున నుచ్చజ్ఞానమును వృద్ధిచేయించుటకు దానమిచ్చిరి.

మన దేశమునందలి రసాయనశాస్త్ర విద్వాంసులలో నసమానులును, ప్రకృతిశాస్త్ర పరిశోధనయందును, పారిశ్రామిక వ్యాపారములందును వంగదేశమున మార్గదర్శకులైన సర్. ప్రఫుల్లచంద్రరాయ లిందులకై అనేక సంస్థాపనములను పరిశీలించి మందిరాదులకును, ఐరోపియను ఉద్యోగస్థులకును, అధికద్రవ్య వినియోగమును చేయక ఉపాయముగా ప్రకృతిశాస్త్రకళాశాల నత్యుత్తమ పద్ధతిపై స్థాపించి తామే ముఖ్యాధ్యాపకులుగా నుండి చక్కగా నడుపుచున్నారు. ఈ కళాశాల యందలి యుపాధ్యాయు లందఱును స్వతంత్ర పరిశోధనలకు పాశ్చాత్య దేశములందుఁగూడఁ బేరుపడసిన పండితులు. ఇందుభారతీయులే యుధ్యాయులుగా నుండవలయునను నియమముకలదు. వీరందఱును భారతీయులే. వందలకొలఁది విద్యార్థులు దీనియందు మనదేశమందింకెక్కడను లభింపని ఉన్నతవిద్య నభ్యసించుచున్నారు. వారిలో కొంద ఱాంగ్లదేశమందలి విశ్వవిద్యాలయములచేతను. శాస్త్రసం

ఘుములచేతను, తమ పరిశోధనలకుగాను బిరుదము లీయఁబడి గౌరవింపఁబడి యున్నారు.

దీనికి దొరతనమువారు విశేష సాహాయము నీయకఁ బోయినను కళాశాలాకార్యము మిక్కిలి తృప్తికరముగనే యున్నది. ఇందు ఉన్నత సాంకేతిక విద్యనుకూడ నేర్పుటకుఁ గొన్ని నెలలక్రిందటనే సర్. రాసవిహారిఘోషుగారు 11,43000 రూపాయలను, మఱికొంద రితర సహాయమును చేసిరని తెలియుచున్నది. ఈ శాస్త్రకళాశాలాపండితులు పారిశ్రామిక కార్యములకుఁజాల సహకారులగు చున్నారు. ఒక జమీందారు కలకత్తా విశ్వవిద్యాలయమున కీసమయముననే యొసఁగిన యాస్తివలన 6½ లక్షల రూపాయల ద్రవ్యము వచ్చెను. ఈమొత్తమునుగూడ ఈవైజ్ఞానిక కళాశాలయందే సాంకేతిక విద్యాదులను, వృద్ధిఁ చేయుటకును, పరిశ్రమల కుపయోగించు రసాయనశాస్త్రమును బోధించుటకును విశ్వవిద్యాలయాధికారు లుపయోగింతురని తెలియుచున్నది.

---

## ౮ వ అ ధ్యా య ము.

### తాతా యినుప యంత్రశాల.

ప్రపంచమందలి లోహపదార్థములలో నెల్ల యినుము పయుక్తమైనది. ఇది మిక్కిలి చౌకగానుండుటయేగాక చాల దృఢమైనదియు, శీఘ్రముగా శిథిలము కానిదియు నగుటచేత నితరలోహపదార్థములకన్న నధికముగా నుపయోగింపఁబడుచున్నది. సాధారణముగా యినుపవసిము ట్లవసరము లేనివా రుండరు. పాళీలు, సూదులు, మేకులు, కత్తులు మొదలగు సర్వసామాన్యముగా నుపయోగించు పసిముట్లు యినుముతోనే చెయ్యఁబడి ప్రతిదినమును వాడఁబడుచున్నవి. సుత్తులు బాడిశలు, గడ్డపారలు, మొదలగువ్యాపారోపకరణములు మంచి యినుము

ముతోను, ఉక్కుతోను చేయఁబడుచున్నవి. నాగరికత హెచ్చినకొలఁదినిమన దేశమందును, యితర దేశములందును కూడ యినుపవస్తువుల యుపయోగ మధిక మగు చున్నది. పూర్వము కఱ్ఱతో చేయఁబడు పదార్థము లనేకము లిప్పుడినుముతో చేయఁబడు చున్నవి. ఇవికాక ఆవిరియంత్రములు, ఇనుపదారులు, కర్మాగారయంత్రములు, తుపాకులు, ఫిరంగులు మొదలగు జాతీయావశ్యకత గల నవీన పదార్థము లనేకములు యినుముతోను, ఉక్కుతోను, చేయఁబడి వాడుకలో నుండుచున్నవి. ప్రతి పరిశ్రమకును కావలసిన ముఖ్యయంత్రము లన్నియు యినుముతోడనే చేయఁబడుటచే యినుముపరిశ్రమ బాగుగా వృద్ధినొందిన దేశమున నితరపరిశ్రమలు కూడ సులభముగా వృద్ధియగుటకు వీలుకల్గును. ప్రస్తుతకాలమందలి యుద్ధోపకరణములకు యినుపపనిముట్లును, ఉక్కుపనిముట్లును మిక్కిలి యావశ్యకములై యున్నవి. అందువలన యినుమువ్యాపారము దేశములందు వృద్ధిబొందియున్నదో అట్టి ఇంగ్లండు, జర్మనీ. అమెరికా దేశములే ప్రపంచమున నధికవ్యాపారవంతములనియు, బలవత్తరదేశములనియు పేరుచెందియున్నవి. అందువలన యినుమును, ఉక్కును వాటితోఁ జేయఁబడు వస్తువులను తయారుచేయు పరిశ్రమ మిక్కిలి ముఖ్యమైనదగుటకు సందేహాము లేదు. ఇనుపపొడి భూమిలోని యినుపగనులలో దొరకును. ఈపొడి త్రవ్వఁబడి పైకి తీయఁబడినప్పుడు యితరపదార్థములతోఁ గలసినదిగాను మిక్కిలి యపరిశుభ్రముగాను ఉండును. అందువలన దానిని మిక్కిలి చక్కగా బాగుచేసినఁగాని యుపయోగార్హముగా నుండదు. ఇనుపపొడిని కరగించుటకు నేలబొగ్గును, పరిశుభ్రముచేయుటకు సున్నపురాళ్లను సమృద్ధిగా కావలసియున్నవి. ఇవియన్నియు మిక్కిలి బలువైనవియై దూరస్థలమునకు సులభముగాఁ గొనిపోవుటకు శక్యముకానివగుటచే ఈమూఁడు విధములగు గనులును ఒకదానికొకటి సమీపము

నలేక పోయినచో విశేషముగా నుపయోగించుట సాధ్యముకాదు. ఆంగ్లదేశమున నీమూడువిధములగు గనులును దగ్గరదగ్గరగా నుండుటవలన యితరదేశములందుకన్న నచ్చట నీపరిశ్రమ త్వరలో వృద్ధికి వచ్చెను. ఈనైసర్గికవిశేష మాందేశపు ప్రజలకును, ప్రభుత్వమునకును అత్యుపకార మయ్యెను. మన హిందూదేశమున నినుపగనులు కొన్ని యున్నటుల చిరకాలమునుండి దొరతనమువారికిని, ప్రజానాయకులకును గూడ తెలిసియుండెను. చిరకాలమునుండి మనదేశమున నినుముతోఁ జేయఁబడిన పనిముట్లనేకములు వాడుకలో నుండినట్లు గ్రంథములవలనను, భూమిలోనుండి త్రివ్వి యెత్తఁబడిన యుపకరణముల దృష్టాంతములవలనను స్పష్టమయ్యెను. ఇతరదేశీయులగు పూర్వకాలయాత్రికులు కూడ మనగ్రంథములందు మనదేశపు అయఃపదార్థములను గూర్చి వ్రాసియున్నారు. భూమికి పైపైన దొరకిన యినుపపాడితోనే మనకమ్మరులు మొదలగువారు నాటుచాకులు మొదలగు ఉపకరణములను చేయుట మనకు తెలిసియేయున్నది. కాని యినుపపరిశ్రమ నొకదానిని స్థాపించుటకు మనదేశమున సదుపాయములు లేవని చాలవఱ కందఱును నమ్మియుండిరి. దొరతనమువారు తమ భూగర్భపరిశోధకశాఖవారివలన మనదేశపు భూస్వభావము నంతటను బరీక్షచేయించినప్పుడు మధ్యరాష్ట్రముల ప్రాంతమునమాత్రము విశాలమగు యినుపగనులు కలవనియు, అయినను సమీపమున నేలబొగ్గుగనులును, మన్నపురాళ్లగుట్టలును లేనందున వానినుండి యినుమును, ఉక్కును, తయారుచేయుటకు వీలు లేదనియు దొరతనమువా రభిప్రాయపడిరి. వంగదేశప్రాంతమందు రాణిగంజ్ మొదలగు స్థలములందు నేలబొగ్గుగను లున్నను అచ్చటకు దగ్గరగా నినుములేదని యందఱును దలఁచిరి.

జమ్సెట్జీ తాతాగారికి చిరకాలమునుండి మనదేశమున సాధ్యమైనయెడల నయఃపరిశ్రమను తప్పక స్థాపింపవలయునని యాలోచన

ము కల్గియుండెను. దానివలనఁ జాలలాభము కల్గుటయేకాక జనుల కది మిక్కిలి యుపకారముగా నుండును. తగినంత ద్రవ్యసహాయమును, ప్రానికయు, ప్రకృతిశాస్త్రజ్ఞానమును కలిగియున్నయెడల మనదేశము న దాదాపుగా నన్ని పరిశ్రమలను సాగింపవచ్చునని తాతాగారికి నమ్మకము కల్గియుండెను. అందువలన తక్కినవారివలె వారు నిరాశు లుకాక పూర్వకాలమునందు మనదేశమున విరివిగా చేయఁబడి వ్యాపించియుండిన పనిముట్లనుబట్టిచూడ తప్పక యినుము చేయఁదగు స్థలముండవచ్చునని విశ్వాసము కల్గెను. కొన్నిప్రాంతములందు దొరతన మువారి పరిశోధనము తృప్తికరముగా లేదని యూహించి ద్రవ్యవ్యయమునకు జంకక తాతాగారు భూతత్వవేత్తలగు కొందఱు విద్వాంసులను హెచ్చుజీతము లిచ్చి రావించి వారిచే నినుపగనుల కనుకూలముగా నున్నస్థలములను పరీక్షింపఁజేసెను. 1875 సంవత్సరమునుండి తాతాగా రీవిషయమై ప్రయత్నముఁ జేయుచు కొన్నిలక్షల రూపాయలను ఖర్చుపెట్టి చాలభాగమును పరిశీలింపఁ జేయుచు రాగాచివరకు కొన్ని కొన్నిస్థలములందు మిక్కిలి యుపయుక్తములగు నినుపగనులు విహార ప్రాంతములనున్నట్లును వానికిసమీపముననే బొగ్గును, సున్నపురాళ్లును కూడ దొరుకుననియు తెలియవచ్చెను. వీనిలో తక్కిన వానికన్న నెక్కువ యుపయోగకరమగు గని మౌర్భంజియను స్వదేశసంస్థానములో నిది. ఈరాజ్యమున సర్వోత్తమమగు యినుపగని యున్నటుల మొట్ట మొదట హిందూదేశప్రభుత్వభూగర్భపరీక్షాశాఖయందు సహాయపర్యవేక్షకుఁడుగా చిరకాలము పనిచేసి విశేషానుభవము కలిగియుండిన ప్రభుమదనాధవసు అను వంగదేశీయోద్యోగికి తెలియవచ్చెను. తాతాగా రీవిషయమై చిరకాలమునుండి యత్నించుచున్నట్లు తనకు తెలిసియుండుటచే ఆయన యీవిశేషవార్తను తాతాగారికిని, మౌర్భంజి ప్రభువునకును తెలియఁజేసి వారిద్దరి యభిలాషముపై తానే వానిని

స్వయముగాఁ బరిశీలించి యాసంగతిని బ్రచురము చేసెను. జమ్సెట్జీ తాతాగారింతలో కాలముచేసినను వారిపుత్రులిద్దఱును తాతాగారి యంతరంగమిత్రులగు నస్సర్వాన్ జేవిడ్, తానా, బోరిచా మొదలగు వ్యాపారనాయకులతోఁ గలసి యాలోచించి తుదకు 1907 సంవత్సరమున నొక జాయంటు స్టాకుసంఘమును స్థాపించిరి. దీని మూలధనము రెండుకోట్ల ముప్పదియొక్కలక్షల రూపాయలు. ఇందు కొన్నిభాగములొక్కొకటి 75 రూపాయలచొప్పునను కొన్ని రు 150లను కొన్ని రు 30లుగాను ఏర్పరుపఁబడెను. చాలభాగములు తాతా కుటుంబము వారి చేతను, తక్కినవి యితరవ్యాపారనాయకులచేతను గ్రహింపఁబడెను.

ఇట్లు కావలసినద్రవ్యము సమకూడిన తరువాత మార్భంజిమహారాజాగారినుండి యినుపగనులుప్రదేశ మంతయు గనులు పనిచేసుకొనుటకు సంపూర్ణాధికారముతో కవులుకు తీసికొనఁబడెను. దీనికి సమీపముననున్న నేలబొగ్గుగనులును, మఱికొన్ని యితరఖనిప్రదేశములును దొరతనమువారినుండి కొనఁబడి యంత్రశాలానిర్మాణమునకై ఆంగ్లదేశమునందలి షెఫ్ఫీలు నగరమునకును, యితరముఖ్యప్రదేశమునకును ప్రతినిధులుపంపఁబడిరి. వారచ్చటి యంత్రశాలలను చూచి అన్నిఁటిలో నుత్తమములగు క్రొత్తరీతి ఉక్కుపొయ్యి, బాయిలరు మొదలగు నవీనోపకరణములను, యంత్రాంగములను దెప్పించి హిందూదేశమున నమర్చుటకు అచ్చటి యినుపయంత్రశాలల యధికారులతో నేర్పాటుచేసి వచ్చిరి. తాతాసంఘమువారు తమ గనులప్రాంతమునందలి వివిధస్థలములను పరిశీలించి తుదకు సాక్షియనుకుగ్రామ మనమీపమున యంత్రశాలను స్థాపించుటకు మిక్కిలి యనుకూలముగా నున్నదని స్థిరపఱచిరి. కలకత్తానగరమునుండి బొంబాయిప్రాంతమునకు రెండు యినుపదారులు కలవు. వానిలో దక్షిణపుదగు బెంగాల్ నాగపురశాఖపై కలకత్తానుండి నూటయేబదిమైళ్లకు పైఁగా దాటిపోయిన

చో కాలిమాటి యను రైలుస్టేషను కలదు. ఇది విహారరాష్ట్రములో ఛోటనాగపురభాగములోని సింహభూమిజిల్లాలో నున్నది. కాలిమాటికి మూడుమైళ్ల దూరమున సాక్షి యని పిలువఁబడు గుడిసెల పల్లె యొకటి యుండెను. ఈప్రాంతమునందలి జను లందఱును ఆటవికులు, అనాగరికులునుగా నుందురు. వంగభాషయును హిందిప్రాచ్యశాఖయును కలసిన యొక యుపభాష యీప్రాంతమున మాట్లాడఁబడుచుండును. ఇచ్చటి ప్రదేశ మంతయు దట్టమగు అడవులతోను, పర్వతశాఖలతో నిండియున్నందున నింతవఱకును మిక్కిలి యనారోగ్యకరమని భావింపఁబడుచుండెడిది. కాని యీప్రాంతము తమకుఁ గావలసిన గనుల కన్నిఁటికిని సమీపముగా నుండుటవలనను ఇచ్చటనే పాఱు స్వచ్ఛమగు ఏరువలనను, సమృద్ధమగు జలవసతి కలిగియున్నందునను, ఈప్రాంతము మిక్కిలి చల్లఁగాను ఆరోగ్యకరముగానే యుండుననియు, నీళ్లను పరిశుభ్రము చేసి త్రాగిన జబ్బుచేయదనియు, ఆరోగ్యశాస్త్రజ్ఞులు పరీక్షించి చెప్పినందునను, సమీపముననే యినుపదారి కూడ నున్నందునను అచ్చటనే కర్మాగారము కట్టుట ప్రారంభింపఁబడెను. భూస్థలపరిశోధన లంతటితో నిలుపఁబడక క్రొత్తగనులప్రాంతమున నెచ్చట నెంతెంత యున్నదియు, భూతత్వజ్ఞవిద్వాంసులు తాతాసంఘము వారిక్రింద పనిచేయుచునే యున్నారు. కర్మాగారమును పూర్తి చేసి పిట్స్బర్గు మొదలగు స్థలములనుండి యంత్రములను తెప్పించి యమర్పించుటకైదుసంవత్సరములు పట్టెను. ఈయంత్రములను చక్కఁగాఁ బనిచేయుట మనదేశమునం దెవ్వరికిని దెలియనిదగుటచే జర్మనీనుండియు, అమెరికా, ఆంగ్లదేశములనుండియు, కొందఱు ప్రధానకార్మికులును, యంత్రశాలలోని వివిధశాఖలను నడుపువారును, వాస్తువిద్యావిశారదులగు యింజనీర్లను రప్పించి కొన్నిసంవత్సరములవఱకు గొప్పజీతములపై పనిచేయుటకు స్థిరపరుపఁబడిరి. కార్యక్రమము వృద్ధి

వైనకొలఁదిని బిహార సంయుక్తరాష్ట్రప్రాంతమునుండి కూలిజనులు రావింపఁబడి పని నేర్చుకొనుట కలవాటు పడిరి. అచ్చటను కొన్ని క్రోసుల దూరమునందున బొగ్గుగనులనుండి తేఁబడిన నేలబొగ్గు సహాయమున మొర్భంజిరాష్ట్రములోని యినుపపాడి కరగించి గొప్ప అయోయంత్రములందు శోధించి పరిశుభ్రము చేయఁబడి శుభ్రమగు యినుముగాను, ఉక్కుగాను చేయఁబడును. దీనికై కావలసిన యనేక రాసాయనికాదిపదార్థములు మొదట విదేశములనుండి రప్పింపఁబడుచుండెను. కాని యుద్ధము ప్రారంభమైనది మొదలు విదేశములనుండి దిగుమతులు తగ్గిపోయినందున కొన్ని మనదేశమునందలి బెంగాల్ కెమికల్ మొదలగు కంపెనీలనుండియు, కొన్నిఁటికి ప్రతినిధివస్తువుల నుపయోగించియు, మఱికొన్నిఁటిని సాక్షి యంత్రశాలయందే సిద్ధముచేసియు, ఇట్లు పరదేశసహాయ మక్కఱలేకయే ఉక్కును, ఇనుపపనిముట్లును యిచ్చట చేయఁబడుచున్నవి. ఈయంత్రశాలయందు తయారుచేయఁబడు వస్తువులు దేశమున నందఱకును, అందు ముఖ్యముగ దొరతనమువారికిని మిక్కిలి యుపయుక్తములైనవి. యుద్ధ మారంభించినది మొదలు దొరతనమువారికి యినుపపనిముట్ల యావశ్యకత మఱింత యధికమయ్యెను. జనులు సాధారణముగా నుపయోగించు యినుపపదార్థముల దిగుమతి తగ్గిపోవుటయేకాక దొరతనమువారికికూడ యినుపవస్తువులు దొరకుట మిక్కిలి కష్టమయ్యెను. అంతేకాక యుద్ధావసరములకై బస్రా ప్రాంతములందును, ఇతరప్రదేశములందును, యినుపదారులు వేయించుటయు, భటులకొఱకు అనేకవిధములగు ఉక్కు ఆయుధములను, ఉపకరణములను మనదేశముననే దొరతనమువారు సిద్ధముచేయించి వివిధప్రాంతములకు పంపవలసివచ్చెను. ఇందులకు కావలసిన ఇనుమును, ఉక్కును, పనిముట్లను తయారుచేసి యిచ్చి టాటాయినుపయంత్రశాలలవారు దొరతనమువారి కమూల్యమగు సహా

యము చేసిరి. సంవత్సరమున కిరువదివేల టన్నులధికముగా ప్రశస్తమగు రైలుకమ్ములను సిద్ధముచేసి యిచ్చుటకు తాతాకంపెనీవారు దొరతనము వారితో నిర్ణయము చేసికొని అయిదుసంవత్సరములనుండి అట్లుతృప్తికరముగా నిచ్చుచున్నారు. తాతాఅయోయంత్రశాలవారి సహాయములేకపోయినచో యీమహాయుద్ధమున నెట్లుపరికరములనన్నిఁటి నందిచ్చియు, ఆయుధములను పంపియు, యుద్ధమును సాధించియుందుమో తలఁచుకొనన నాశ్చర్యము కల్గుచున్నదని మనరాజ్యప్రతినిధిగారు చెప్పియున్నారు. ఈయుద్ధకాలమందు జపానీయులును, అమెరికనులును గూడ తాతాకంపెనీవారి యినుపవస్తువులను కొనియున్నారు.

ఇట్లు ప్రతి సంవత్సరమును వ్యాపారము వృద్ధియగుచుండుటచేత కంపెనీకి లాభముకూడ నెక్కువయయ్యెను. భూమిలోనుండి తీయఁబడిన పొడిలోనుండి యినుము వేరు చేయఁబడినపుడు అనేకములగు యితరపదార్థములు కూడ నుత్పన్నములగును. ఇవియన్నియు అనేకవ్యాపారముల కుపయోగించున వగుటచే వానివలనగూడ కంపెనీవారికి చాలద్రవ్యము వచ్చును. కార్యమప్పుడే ప్రారంభింపఁబడుచుండి నప్పుడు 1912 యందు 8 లక్షలరూపాయలును, 1913 యందు 23 లక్షలునులాభము వచ్చెను. ఇప్పుడా వ్యాపారము పూర్తిగా వృద్ధియగుచున్నందునను, సహోత్పన్నపదార్థము లిప్పుడు చాలవఱకు వినియోగింపఁబడుచున్నందునను ప్రస్తుతము ఖర్చులుపోను సంవత్సరమునకు 7 లక్షల వరకు లాభము వచ్చుచున్నది. ఇందు కొంత భాగము ఏటేటను భాగస్థులకుఁ బంచిపెట్టఁబడి మిగిలినవి యంత్రములను వృద్ధిచేయుటకును మూలధనముగాను చేర్చి యుంచఁబడుచున్నది. ఈ యేర్పాటువలన భాగస్థులకు ముందు ముందు విశేషలాభము వచ్చుట నిశ్చయము. ఈ మహాపరిశ్రమకు సంబంధించిన యంత్రశాలలను, గనుల మ

ములను నడపించుటకు పాశ్చాత్యదేశమునుండి కార్యవాహులును, వివిధ వాస్తువిద్యావిశారదులును, ప్రకృతిశాస్త్రజ్ఞులు, పరిశ్రమదక్షులును తీసికొనిరాఁబడిరి. వారికి మిక్కిలి హెచ్చుజీతము లిచ్చుట యావశ్యకమైయున్నది. నియమిత కాలమైన తరువాత వీరిలో కొందఱుఁ బంపివేయఁబడి వారిస్థానమున సమర్థులగు హిందూదేశీయులు నియోజింపఁబడుచున్నారు. ఉక్కును తయారుచేయుట అభ్యాసముకల జర్మను కార్మికులుకూడఁ గొందఱు పని చేయుచున్నారు. యుద్ధకాలమున శత్రుదేశస్థులగు జర్మను ఆస్ట్రియను కర్మచారులు పంపివేయఁబడవలసియుండినను తాతా అయః కర్మాగారము యుద్ధకాలమున నిలచిపోయిన యెడల కంపెనీవారికిని, ప్రజలకును, దొరతనము వారికినికూడ అనేక కష్టములు కలుగునను కారణమున జర్మను కార్మికులు రాజద్రోహాచర్యలు చేయకుండునట్లు రక్షకభటులను నియమించి వారిని యథాప్రకారముగా కర్మాగారమందు తమకృత్యములను నెఱవేర్పనిచ్చిరి. ఈ యంత్రాలయమందు ప్రస్తుతము సుమారు నూఱుమంది యూరపియనులు పనిచేయుచున్నారు. తక్కిన వారు మన దేశప్రజనులు. ఇప్పుడీయంత్రశాలయందు ఎలెక్ట్రికల్ ఇంజనీరు వైద్యపారిశుధ్యాధ్యక్షుఁడు మొదలగువారు కొందఱు హైందవులే ఉన్నతోద్యోగీయులుగానున్నారు. క్రమక్రమముగా యూరపియనుల సంఖ్యతగ్గి వారి కార్యమును హిందూదేశీయులు నెఱవేర్చుట యావశ్యకమై యున్నది. ఈ అయోయంత్రశాలయందును, దీని శాఖోపశాఖలందును వేలకొలఁది జనులు పనిచేయుచున్నారు. సహాయపరిశ్రమ లనేకము లుత్పన్నములైనవి. నేలబొగ్గు గనులు ఇనుపపొడి గనులు మొదలగు స్థలములందుఁ గొన్నివేల వఱకు కూలిజనులు కొందఱు, ఇంజనీయర్లు, ఓవరుసీయర్లు మొదలగు ఉద్యోగస్థులును తమతమ కార్యములను నిర్వహించుచున్నారు. ఒక్కసాక్షి కర్మాగారమందే ఉన్నతోద్యోగులు, గుమస్తాలు

మొదలగు వారుకాక ప్రత్యేకము కూలిపనిచేసి యంత్రములనడుపు హిందూదేశీయులు పది పండ్రెండువేలకు పైగానున్నారు. ఈ యంత్రశాల స్థాపింపఁబడుటకుఁ బూర్వము కొన్ని గుడిసెలు తప్ప వేఱు యిండ్లు లేక అంతయు నరణ్యప్రాయముగా నుండెను. కర్మచారులు క్రమమున కుటుంబములతో స్థిర నివాస మేర్పఱచుకొనుటకుఁ బ్రారంభింపఁగానే ఆప్రదేశమున నొకచక్కని నగరము బయలువెడలి త్వరలోనే వృద్ధినొంద నారంభించెను. ఇందొక భాగమున యూరపియనులును యితరులగు ఉన్నతోద్యోగులును నివసించుచుందురు. ఇచ్చటను సుందరములగు భవనములును, వానిచుట్టును విశాలమును మనోహరములు నగు తోఁటలును వృద్ధియై చూచుటకు మిక్కిలి యింపుగా నుండును. తక్కిన భాగములందు గుమాస్తాలు మొదలగు వారి గృహము లొకప్రక్కను, తక్కినచోట్ల కార్మికుల నివాసములును ఉండును. జనులందఱును స్థిరముగా తమ కుటుంబములతో నుండుటచేతను వేఱు వేఱు వ్యాపారములకొఱకు వర్తకులు, ఉపాధ్యాయులు మొదలగు అనేకవృత్తులుగల జనులందఱును వచ్చి నివసించుచున్నందునను పదునైదు సంవత్సరములలో యొక కుగ్రామముగానుండిన 'సాక్చి' యొక పెద్దనగరముగా మారిపోయినది. ఈనగర మితర పారిశ్రామిక నగరములవలె యనారోగ్యకరమగు కూలిజనుల గుడిసెలతో నిండి కలరా మొదలగు వ్యాధుల నివాసస్థానము కాలేదు. జమ్సెట్జీ తాతాగారు కార్మికవర్గముయొక్కయు, ఉద్యోగులయొక్కయు, సౌఖ్యమును, ఆరోగ్యమును, వ్యాపారాభివృద్ధికిని, దేశక్షేమమునకును అత్యంతావశ్యకమగు విషయమును పూర్తిగా గ్రహించియుండిన సంగతిని మనము చూచియున్నాము. వారిపుత్రులును, మిత్రులును జమ్సెట్జీగారివలెనే దీని ప్రాముఖ్యమును బాగుగ గ్రహింపఁ గలిగిరి. నగరమంతయు నొక్కసారిగానే వృద్ధియై పది సంవత్సరముల మధ్యకాలమున [illegible] కట్టఁబడినది.



అంతకుఁ బూర్వ మాస్థలమున ననారోగ్యమున కాకరమగు పురాతన జీర్ణపత్తన మేదియు లేదు. కూలిజనుల కుటీరములు విశాలవీథులయందు యిరుకు లేకుండునట్లును, మురికినీళ్ల కాలువలతోను, గవాక్షములు మొదలగు వానితోడను కట్టఁబడి యారోగ్యకరములుగఁ జేయఁబడి నవి. కార్మికుల సహాయముల కొఱకనేక వైద్యశాలలును, విద్యా లయములును స్థాపింపఁబడి చక్కగా నడుపఁబడుచున్నవి. యంత్ర సహాయమున జలము పరిశుభ్రము చేయఁబడి నగరము నందన్ని భా గములకును స్వచ్ఛోదకము సమృద్ధిగాఁ బంపఁబడును. అనేకయంత్ర శాలలో 'కోల్ గాస్'ను విద్యుచ్ఛక్తియును విశేషముగా నుత్పన్నమగు చుండును. ఇవి నగరమందు వాయుదీపమును, విద్యుచ్ఛక్తిదీపములను పెట్టుటకుఁగూడ నుపయోగింపఁబడుచున్నవి. మధ్యతరగతి ఉద్యోగ స్థులు మొదలగు వారిసహాయమునకై అనేక పఠనమందిరములు ను భాండాగారములును ఉన్నతవిద్యాశాలలు నుకూడఁ గలవు. గొప్ప వ్యా పార మొకటి యవిచ్ఛిన్నముగ సాఁగుచున్న స్థలమున నితర వ్యాపా రము లనేకములను వృద్ధిఁజేసికొనుటకవకాశ మధికముగా నుండును. ఈకాలమున నొక్కొక పరిశ్రమకు యితర పరిశ్రమ లనేకములు స హాకారులుగా నుండవలసివచ్చును. గనుక తాతాసంఘమువారిచేతను యితరులచేతను యీనగరముననే అనేక నూతన యంత్రశాలలును, వ్యాపారములును ప్రారంభింపఁబడి దినదినాభివృద్ధి నొందుచున్నవి. ఈవఱకే 60 వేల జనసంఖ్యగల యీనగరమున స్వల్పకాలముననే 150 వేలవఱకు సంఖ్య వృద్ధికాఁగలదని దొరతనము వారిచే లెక్క వే యఁబడినది. నగరు పారిశుధ్యాదుల యాజమాన్య మొక ప్రత్యేకసం ఘమున కధీనము చేయఁబడినది.

ఇచ్చట నెలకొల్పఁబడిన యనేకశాఖలు గొప్పగొప్ప పరిశోధ నశాఖలలను బోలియున్నవి. వాస్తువిద్య విద్యుచ్ఛక్తి, ఖనిజశాస్త్రము

పారిశుధ్య శాస్త్రము, వ్యవసాయము, రసాయనము, పదార్థవిజ్ఞానము, లోహశాస్త్రము, సంఘసేవ, కర్మాగార పరివర్తనము మొదలగు ననేకకళలందు అనుభవమును సంపాదించుటకిచ్చట నసమానమగు సదుపాయము కలదు. ఈసందర్భముల నాలోచించి యిచ్చటనే అనేక కార్మికవిద్యాలయం దున్నతశిక్షణమిచ్చుటకై సాంకేతికవిద్యాలయము నీ నగరమున నిర్మింప సమకట్టిరి. దీనికి దొరతనమువారు సహాయము చేయఁగలమని చెప్పిరి. పారిశ్రామికాభివృద్ధికి సాంకేతికవిద్య యత్యవసరము. ఉచ్చ సాంకేతిక విద్యను పూర్ణముగా నభ్యసించుటకీవరకు మనదేశమున తగిన సదుపాయము లేదు. ఉన్నవానిలో బొంబాయిలోని విక్టోరియా టెక్నికల్ ఇన్స్టిట్యూటు కొంచెము బాగుగా నున్నది. సాక్షిలోని సాంకేతికాలయము పూర్తియైనతరువాత యీ యభావము మనదేశమున తీరి ఉన్నత సాంకేతికవిద్య పాశ్చాత్య దేశములకు పోవలసిన యావశ్యకత పోవునని తలఁపఁబడుచున్నది. సుమారొక సంవత్సరముక్రింద మన రాజప్రతినిధి యగు చెమ్స్‌ఫర్డు ప్రభువుగారు తాతా అయోయంత్రశాలను తిలకించుటకై సాక్షికివచ్చినప్పుడు వారికి స్వాగత మిచ్చుటకు చేయఁబడినసభయందు అందఱియనుమోదముపై సాక్షియొక్క యొకభాగమునకు జమ్షెడ్పుర మనియు తక్కిన భాగమునకు తాతానగరమనియు నూతన నామకరణము గావింపఁబడెను. ఈ అయోయంత్రశాలను ప్రారంభించుటకు చిరకాలము క్రిందనే నిశ్చయించి అందుకై తనయంత్యకాలమున నంతయును వినియోగించి దానిస్థాపనమునకు మూలకారణముగా నుండిన జమ్షెట్జీ తాతాగారి పవిత్రనామమీ రూపమున శాశ్వతముగా నందఱికిని తెలియఁగలదు. తాతాసంఘమువారిచే విహారప్రాంతమున ప్రారంభింపఁబడిన అయః పరిశ్రమము జయప్రద మగుట ప్రపంచమునకు తెలియఁగనే జనులలో నీవిషయమున నుత్సాహముకలిగి కొందఱు వ్యాపా

రులిట్టి వ్యాపారమును తాముస్థాపించుటకు ప్రయత్నములను చేయు చున్నారు. వంగరాష్ట్రమున నయః పరిశ్రమమును వృద్ధిచేయుటకొక సంఘము స్థాపింపఁబడినది. రాణిగంజీవద్ద నేలబొగ్గుగనులును దానిసమీపమున నే యినుప పొడిగనులు గలవు. అందువలన నీవ్యాపారమును శీఘ్రకాలమున నభివృద్ధిఁ గాంచవచ్చును. ఈనూతన సంఘపు ముఖ్య భాగస్వాములును నాయకులును, ఆంగ్లేయ వ్యాపారులు దక్షిణ దేశమందలి మైసూరు సంస్థానమున మఱియొక అయఃపరిశ్రమము ప్రారంభింపఁ బడుచున్నది. ఇచ్చట యినుపగనులు కొన్నికలవు. నేలబొగ్గు గను లీప్రాంతమున లేక షిమోగా మొదలగు స్థలములందు మహాటవులు విశేషముగానుండుటచే వానిసహాయమున బెంకిపురమున నినుపపొడి కరగింపఁబడి ఉక్కు తయారుచేయఁబడును. దీనికి కావలయు మూలధనము మైసూరు దొరతనము వారిచేతనే భరింపఁబడినది. ఈ వ్యాపారమును సరిగాసాగించి పనిచేయుభారమును యాజమాన్యమును తాతాసంఘము వారి యధీనము కావింపఁబడినది.

---

## ౬ వ అ ధ్యా య ము.

### జలవిద్యుచ్ఛక్తిశాల.

యంత్రములను నడపుటకు చోదకశక్తి కావలసియున్నది. శక్తిమూలమున యంత్రములోని చక్రములకును, యితరాంగములకును కదలిక కలిగి వాని సంపర్కమున మరలు వానివాని పనిని చేయుచుండును. యంత్రము మిక్కిలి చిన్నదైనయెడల మనుష్యశక్తిచేతనే యంత్రములను పని చేయవచ్చును. మనదేశపు చేతిమగ్గములు రాట్నము మొదలగున విట్లే నడుపఁబడుచున్నవి. ప్రస్తుతకాలమందలి గొప్పగొప్ప యినుపయంత్రములు మొదలయినవి మనుష్యబలముచే పని

చేయింప సాధ్యమైనవి కావు. ఈమహాయంత్రములు మనుష్యులుచే యు పనికన్న చాల యెక్కువపనిని చేయును. అట్లే వానిని కార్యక్రమమున నుంచుటకు మనుష్యబలముకన్న నధికమగు శక్తి కావలసి యున్నది. కూలిజనులు అందలి వివిధాంగములను సవరించి బాగు చేయుచుండుట పదార్థములను ఆయాస్థానములం దమర్చి వానిని మరల మార్చుచుండుట మొదలగు కార్యములను మాత్రము చేయుచుందురు. యంత్రముల నడుపుటకు కావలసిన శక్తి అనేకవిధములుగా పుట్టింపఁబడవచ్చును. సాధారణముగా గొప్పగొప్ప యంత్రము లన్నిఁటికిని ఆవిరియంత్రములు చేర్చఁబడియుండి ఈ ఆవిరియంత్రములందు నీరు సలసల కాచఁబడును. నీటియావిరి యన్నిదిశలను వ్యాపించుశక్తి గలదగుటచే దగ్గరనున్న వస్తువులనన్నిఁటిని త్రోయుచుండును. దాని బలమున గొప్ప యినుపకమ్ములును వాని సంపర్కమున చక్రములు మొదలయినవియు వేగముతోఁ గదలుచుండుటను మనము ప్రతిరైలు యింజనునందును చూచుచున్నాము. ఇట్లే నేలబొగ్గు చోదకశక్తికి స్థానకమగును. ఇంగ్లండు మొదలగు దేశములందు నేలబొగ్గు చౌకగాను, సమృద్ధిగాను దొరకును నేలబొగ్గు సమృద్ధిగాఁ గలదేశము లీకాలమున నధికసంపన్నములుగా నుండుట కిదియే కారణము. యంత్రములంత పెద్దవి కానప్పు డడవులు విశేషము వ్యాపించియున్న స్థలములందు బొగ్గుకు బదులు కట్టెల నుపయోగించుటఁ గూడఁ గలదు. కాని అట్లు చేయుట చాల వ్యయసాధ్యమగుటచేత నేలబొగ్గు దొరకని స్థలములందు మాత్రమే కొంత వఱకిట్లుఁ జేయ వీలుకల్గును. గొప్ప యంత్రముల నిట్లు కట్టెల మూలముననే నడపించినయెడల స్వల్పకాలముననే ఆ చుట్టుపట్లనున్న యడవులన్నియు నశించిపోవును. అందువలన నేలబొగ్గు సమృద్ధిగా దొరకని దేశములందు యంత్ర చలనమునకై కొన్ని దేశముల యందితర ప్రయత్నములు చేయఁబడుచున్నవి. హాలండు

మొదలగు దేశములందు వాయు యంత్రములు స్థాపింపఁబడి పనిచేయు చున్నవి. ఆదేశమున నిరంతరమును సముద్ర వాయువేగముతో వీఁచుచుండును. వాయువున కభిముఖముగా చక్రము లుంచఁబడి దాని వేగమున గిరగిరఁ దిరుఁగుచుండును. ఈచక్రములతో సంబంధము కలుగు నట్లమర్చఁబడిన యంత్రము లీచక్రములవలన త్రిప్పఁబడుచుండును. ఇట్లు వాయువు చోదకశక్తినిఁ గల్గించును. ఇట్టి యంత్రములు మనదేశమున నరుదు. ఇట్లే చిన్నచిన్న జలపాతముల క్రింద చక్రము లుంచఁబడి ఆచక్రములు కదలి వాని సంపర్కమున చిన్న యంత్రములను నడపించుటఁ గూడఁ గలదు. కాని యుపాయము లన్నియు పెద్దపెద్ద శాలల కంతగా యుపయోగఁపడవు. ఆవిరియంత్రము లక్కరలేకుండ అంతకన్న నెక్కువబాగుగా విద్యుచ్ఛక్తి యంత్రసహాయము న యంత్రములను పనిచేయవచ్చునని కొందఱు ప్రకృతి శాస్త్రజ్ఞులు కనిపెట్టిరి. సులభముగా విద్యుచ్ఛక్తిని జనింపఁజేయుటకు సదుపాయము కలిగియున్నచో అట్టి స్థలములందు నేలబొగ్గు గనులు సమీపమున లేక పోయినను విద్యుచ్ఛక్తిని సహాయముననే యంత్రములు మంచి లాభముతో నడుపఁబడుచున్నవి. సాధారణముగా రాసాయనిక పద్ధతిని విద్యుచ్ఛక్తినిఁ జనింపఁ జేయుటకు ద్రవ్యము చాల యధికముగా వ్యయము చేయవలసి యుండుటవలన యంత్రములను నడపుటకు వలయునంత యధికముగా విద్యుచ్ఛక్తిఁ జనింపఁ జేయుట కమితమగు సొమ్ము ఖర్చుపడును. అట్లు పనిచేసిన యంత్రశాలలపై లాభమునకు బదులు నష్టమే యధికమగును. సులభముగా గొప్పగొప్ప వ్యాపారములకుఁ గావలసినంత విద్యుచ్ఛక్తినిఁ జనింపఁజేయు మార్గమొకటిఁ గొంతకాలము క్రింద కనుగొనఁబడెను. ఆఫ్రికా, అమెరికాల యందలి కొన్ని పెద్దనదులు ప్రవాహమధ్యమున పర్వతముల సందులనుండిపోవుచో ఒక్కొకచోట గొప్పయెత్తునుండి క్రిందికిఁ బడును. అంత జలసము దాయ

మొక్కసారిగా చాల యెత్తునుండి పడునప్పుడు దానికి గొప్ప వేగమును, బలమును కల్గును. ఈజలపాతముయొక్క బలువంతయు నొక్కసారి దేనిపైనైనను బడినప్పుడు ఆవస్తువు అమిత బలముతోఁ ద్రోసివేయఁబడును. పాశ్చాత్యిక యంత్ర నిర్మాతలగుఁ గొందఱు బుద్ధిమంతులు ఇట్టి జలపాతములక్రింద చక్రములను పెట్టినయెడల మనుష్యుల శ్రమ యక్కఱలేకయే ఆచక్ర మత్యధిక వేగముతోఁ దిప్పివేయఁబడుచుండుననియు ఆచక్రమును ఆస్థలము విడిచి జాఱిపోకుండునట్లు అమర్చి దానితోడ నితర యంత్రములను గొలుసులు మొదలగు వానివలన కలిపి జలపాతమువలన కలుగు శక్తిని విద్యుచ్ఛక్తిగా మార్చ వచ్చుననియు, ఈవిద్యుచ్ఛక్తి తీగెలపైఁ గొన్ని మైళ్లదూరము వఱకుఁ గొనిపోవుటకు సాధ్యమైనం దగుటచే దాని సహాయమున నెట్టి యంత్రములనైనను నడపుట సాధ్యమగునని కనిపెట్టిరి.

ఇట్టి జలవిద్యుచ్ఛక్తి యంత్రములు ఆఫ్రికా, అమెరికాలలో విశేషముగా నుపయోగింపఁబడుచున్నవి. మన హిందూదేశమందు ప్రసిద్ధమగున నిది మైసూరు సంస్థానములోని శివసముద్రము నొద్ద నున్న కావేరినదీ జలపాత విషయమునఁ బ్రయత్నింపఁ బడెను. అది మిక్కిలి జయప్రదమై అందువలన విశేష ద్రవ్య వ్యయము లేకయే విద్యుచ్ఛక్తి సమృద్ధిగా నుత్పత్తియగు మార్గము కనిపెట్టఁబడెను. అప్పుడు మైసూరు దివానుగాఁ బనిచేయుచుండిన ధీమంతులగు సర్. శేషాద్రి అయ్యరుగారు దీనికి చాల ప్రోత్సాహ మొసఁగిరి. ఇప్పు డీజలపాతము మూలమున జనించు విద్యుచ్ఛక్తి సహాయముచే అక్కడకు నూఱు మైళ్ల దూరముననున్న కోలారు బంగారుగనులలోని మృత్తికపైకిఁదీసి శుద్ధిచేయఁబడి అందునుండి స్వచ్ఛమగు బంగారము తయారుఁ జేయఁబడుచున్నది. ఈవ్యాపారము నంతను ఒక యూరపియను కంపెనీవారు చేసికొనుచు అందులకుఁగాను మైసూరు దొరతనము వారికిఁ

గొన్ని లక్షల రూపాయలను పన్నుగా నిచ్చుచున్నారు, శివ సముద్ర
మునొద్ద విద్యుచ్ఛక్తిని జనింపఁ జేయుటకు ప్రారంభించి కొన్నిసంవత్స
రములైనను అట్టి యుద్యమము మన దేశమందు మఱియొకచోట నె
క్కడను ప్రారంభింపఁబడ లేదు. ఒకటి రెండు స్థలములందుఁ బ్రయ
త్నింపఁబడినను జయప్రదము కాలేదుఁ కాని మన హిందూదేశమందు
మహానదులును, పర్వతములును విశేషముగా నున్నందున అందలి జల
పాతములు కొన్ని యీవిధముగా నుపయోగింపవచ్చును. జలపాతము
లు పవిత్రముగా నెంచఁబడి అచ్చటి కెల్లప్పుడును జను లనేకులు పో
యి చూచి యానందించి స్నానముచేయుట మనదేశమున నాచారమై
యున్నది. వాని సహాయమున జన సామాన్యపు జీవనమున కనుకూల
మగు పారిశ్రామిక యంత్రశాలలు స్థాపింపఁగల్గుట యింకను నూతన
ముగ నున్నది. బొంబాయి ప్రాంతమున పడమటి కనుమలను ఎత్తైన
పర్వతములు కలవు. పూర్వ కాలపు సాహిత్యగ్రంథము లందివి సహ్య
పర్వతములను పేరఁ బరగుచున్నవి. ఈపర్వతములు పడమటి సముద్ర
మునకు సమీపమున నుత్తరమునుండి దక్షిణమునకు వ్యాపించియున్నవి.
మన ప్రాంతము నందున్న తూర్పుకనుములకన్న నివి మిక్కిలి యెత్తు
గాను అవిచ్ఛిన్నముగాను ఉండుటచే నీపర్వతములపైఁ గురియువాన
యితర స్థలము లందుకన్న నధికముగా నుండును. అందువలన నిచ్చట
గొప్ప జలపాతములు కూడఁ జాలఁగలవు. గోదావరీ, కృష్ణా, కావేరీ
నదుల ప్రవాహ జలము ముఖ్యముగా నీ పర్వతముల నుండియే వ
చ్చుచున్నది. వాస్తుశాస్త్రజ్ఞులు కొంద ఱిచ్చటి జలపాతములు కొ
న్ని విద్యుచ్ఛక్తిని పుట్టించుటకు పనికిరావచ్చునని యూహించిరి.
కాని యథార్థముగా నట్లు తృప్తి జేయుటకుఁ గల సందర్భము నె
వ్వరును కనుబఱుపలేక పోయిరి. జమ్సెట్జీ టాటాగా రీవిషయమును
కొందఱు మహాశయు లగు వాస్తుశాస్త్రజ్ఞులతోఁ జర్చించిరి. అందు

పై వీరి యుత్సాహమును పట్టుదలయును ఎక్కువయై జలపాతసంబంధమున విశేషానుభవముగల వాస్తుశాస్త్రజ్ఞులకు కొందఱికి గొప్ప జీతము లిచ్చి బొంబాయినగరమునకు సమీపమున సమృద్ధిగా విద్యుచ్ఛక్తిని జనింపఁజేయుట కనువగు స్థలములను పరిశీలింపఁజేసిరి. తాతాగారీవిషయమున విశేషప్రయత్నములకు సిద్ధపడుట కొక కారణము కలదు. 1885 సం॥ నుండి బొంబాయిప్రాంతమందలి నూలుబట్టల యంత్రశాలలు వేగముతో వృద్ధియై వేలకొలఁది కూలిజనుల జీవనమునకును, వ్యాపారులలాభమునకును కారణమయ్యెను. క్రమక్రమముగ వీరలలో వీరికిని, ఆంగ్లదేశమందలి లంకషైరుతోను, చీనా జపానుదేశములతోను పోటీ కలుగనారంభించెను. అందువలన యంత్రశాలలను నడపుట కగువ్యయమును సాధ్యమైనంతవఱకు తగ్గించుట చాల యవసరమయ్యెను. ఈవిషయమై చౌకగాను, సులభముగాను కూలిజనులను దూరప్రదేశములనుండి రప్పించుటకు తాతాగారు చేసిన ప్రయత్నమును మనము చూచియున్నాము. యంత్రములను నడుపుటకు శక్తిజనక పదార్థమును సులభముగా సంపాదించుటకూడ గొప్ప సమస్యయయ్యెను. ఇతరదేశములందలి గొప్పమిల్లులకు సమీపమున నేలబొగ్గుగనులు విశేషముగా నున్నవి. బొంబాయిమిల్లులకైన నట్టిసదుపాయము లేదయ్యెను. మనదేశపు నేలబొగ్గుగను లచ్చటికి వందలకొలఁది మైళ్లదూరమున నున్నందునను ఆబొగ్గును రైలుపై బొంబాయికి తెప్పించుట కగుదారివ్యయము చాల యధికమగుటచే బొంబాయిలోని యంత్రశాలాధికారు లంతసొమ్ము మనదేశపు బొగ్గుకై యెక్కువ ద్రవ్యమును యింగ్లీషుకంపెనీల కిచ్చుకొనుటకన్న తూర్పు ఆఫ్రికాలోని గనులనుండి సముద్రముపై నేలబొగ్గును తెప్పించుకొనుట యెక్కువ చౌకగాను సులభముగాను నున్నందున అట్లు చేయుచుండిరి. కాని యిట్లావశ్యకమగు పదార్థముకొఱకు కన్యదేశముపై నాధారపడియుండుట

సమంజసము కాదనియు, ఆఫ్రికాలోని యూరపియనువ్యాపారములు వృద్ధియైనకొలఁదిని అచ్చటి నేలబొగ్గుకూడ ప్రియమగుచున్నందునను, బొంబాయి యంత్రశాలలను నడిపించుటకు మఱియొక యాధారమును చూచుకొనుట యుచితముగా నుండెను. ఇట్టి సందర్భముల నాలోచించి జమ్సెట్జీ టాటాగారు విద్యుచ్ఛక్తిని పుట్టించుటకై తమ యావచ్ఛక్తితోను, పట్టుదలతోను బ్రయత్నింపఁదొడఁగిరి.

కొంతకాలము వివిధస్థలములఁ బరీక్షింపఁబడినతరువాత పడమటికనుమలు జలవిద్యుచ్ఛక్తియంత్రములకు మిక్కిలి యనుకూలముగా నున్నట్లు స్థిరపడెను. నిరంతరమును సమృద్ధిగా పర్వతములనుండి జలము ప్రవహించు స్థలములందే గొప్పజలపాతము లుండఁగలవనుట యందఱును దెలిసినదే యున్నది. మనదేశమునందే గాక ప్రపంచమం దితరప్రదేశము లన్నిఁటికన్నను హిందూదేశమందలి అస్సాము రాజ్యమందలి ఖాసిజయింతపర్వతప్రాంతమందలి చెరపుంజియొద్ద నెక్కువ వాన కురియునని యీవఱకు భూగోళశాస్త్రజ్ఞులు సిద్ధాంతము చేసి యున్నారు. అచ్చట నొకసంవత్సరమున దాదాపు 500 అంగుళములు వర్షించెనని తెలియవచ్చుచున్నది. కాని యిటీవల చేసిన పరీక్షలవలన పడమటికనుమలలోని యొక భాగమున మూడునెలలకాలముననే 546 అంగుళములు అనఁగా 1092 మూరలవర్షము కురిసెనని లెక్కవేయఁబడినది. అందు వరుసగా 31 దినములలో 850 మూరలు కురిసెనఁట. కొన్నికొన్ని స్థలములందు నీరు 1500 అడుగులపై యెత్తునుండి క్రిందపడుచుండును. ఇట్టి గొప్ప జలప్రవాహమువలన తప్పక విద్యుచ్ఛక్తిని సమృద్ధిగా జనింపఁజేయవచ్చునని టాటా సంఘమువారికి నిశ్చయము కల్గెను. ఇచ్చటనున్న విశాలములగు కొండరాతిచరియలు వర్షోదకమును నిలువచేయుట కనుకూలముగనే యున్నవి. ఈస్థలము గొప్ప వ్యాపారస్థానమగు బొంబాయినగరమునకు 50 మైళ్ల లోపుననే యుండుట

మిక్కిలి ప్రయోజనకారియైనది. జమ్సెట్జీ తాతాగారి యనంతరము వారి కుమారులు బొంబాయిలోని యితరవ్యాపారనాయకుల సహాయమున ప్రయత్నములను బూర్తి చేసి అప్పటి స్థితినిబట్టి యీకార్యమును సాగించుటకు కావలసిన ద్రవ్యమును మదింపు వేయఁగా రెండు కోట్ల రూపాయలవఱకు తేలెను. ఈ మొత్తమును సమకూర్చుటకు ఆంగ్లదేశము నందలి లండనునగర మందు భాగస్థులకొఱకు ప్రయత్నములు సలుపఁ బడెను. కాని అచ్చట సొమ్ము వసూలగు మార్గము కనుబడ లేదు. అంతటితో నాప్రయత్నము విడువఁ బడెను. తరువాత మన దేశముననే సొమ్మంతయు చందా వేయఁబడెను. అందు కొంత భాగము తాతా కంపెనీ వారిచేతను కొంచ మితర వ్యాపార నాయకులచేతను మిగిలినదిబరోడా మొదలగు దేశీయ సంస్థానముల రాజులచేతను యీయఁబడెను. లండనుప్రయత్నము వ్యర్థమగుట శుభకరమై ఆధిపత్యమంతయు భారతీయుల వశముననే యుండుట లాభకరమైనది. ఈయుద్యమము బొంబాయిప్రాంతపు వ్యాపారాభివృద్ధికి చాల సహకారియగుట వలన దానిజాతీయ ప్రాముఖ్యమును గ్రహించి దేశీయప్రభువులు కూడనిందు భాగస్థులై తమ సానుభూతిని కనఁబరచిరి. సర్ దొరాబ్జి తాతాగారధ్యక్షులుగను. సస్సూన్ డేవిడు, రత్న తాతా బోరిచా, నరోత్తమగోకులదాస్, తానా, లలూభాయిశ్యామలదాస్ మొదలగు వారు డైరక్టర్లుగను నియమింప బడిరి. 1911 సంవత్సరమున కార్యక్రమము ప్రారంభింపఁబడెను. సాధారణముగా నయాగరా. శివసముద్రము మొదలగు స్థలములందలి జలవిద్యుచ్ఛక్తి యంత్రములు సంవత్సరముపొడుగునను ఎడతెగక ప్రవహించునదుల జలపాతస్థానములందు స్థాపింపఁబడియున్నవి. బొంబాయిప్రాంతమందలి పడమటికనుమలలో నట్టివిశాలములగు పెద్దనదు లేవియు లేవు. హిందూమహాసముద్రమునుండి వచ్చు నైఋతిమేఘములు మనదేశము వైపు వచ్చు

నప్పుడు మొదటనీపర్వతములు తగులుటచే నితరస్థలములకన్న నిచ్చ టవర్షము చాలయధికము కురియును. ఆవానలలో చాలభాగము జ్యేష్ఠాషాఢ శ్రావణ మాసములు మూడింటిలోనే పడును. అందువలన యాషాఢు నెలలో పర్వతములలో పడువర్షోదకమును సంవత్సరమం తయును కొండలపైనున్న సరస్సులలోను చరియలలోను నిలువయుం చిఅవి క్రమముగా పర్వతపు చివరనొక అంచుపైనుండి క్రిందికిపడున ట్లుచేసి అచ్చట విద్యుచ్ఛక్తి నుత్పన్నము చేయవలసి యుండెను. దీని కికావలసిన కట్టడములు కట్టుకొనుటకు దొరతనము వారనుమతి నిచ్చిరి అందులకై మూడుసరస్సులున్న భూమినంతను ఈసంఘము వారు కొని తమస్వాధీనము చేసికొని అందు మొదటిదగు 'షిరవాటా' సరస్సునుం డి, 'వల్వాను' అను రెండవ సరస్సునకును, అచ్చటినుండి మూడవదగు లోనవ్లాసరస్సునకును పెద్దకాలువలను త్రవ్వించిరి. మధ్యను కొండగు ట్టలడ్డముగా నున్నందున వానిలోనుండి గుహాలు దొలిచి మార్గము చే యఁబడెను. వర్షకాలమునందు జలమువీనినుండి కొండలక్రిందకు ప్రవ హించిపోకుండునట్లు నీరునిలుచుటకు కావలసిన స్థలము విడిచి చుట్టును ఒకగొప్ప ప్రాకారమువంటి ఆనకట్టకట్టఁబడెను.-ఇట్లే ఈపీఠభూమి యం తయు ఒకమహాసరస్సుగా చేయఁబడెను. తరువాత లోనవ్లాసరస్సునుం డిజలమునియమిత రీతిని పీఠభూమి చివరకు తీసికొని వచ్చుటకు పెద్ద కాలువలు త్రవ్వింపఁబడి కాలువ యడుగు భాగమును ప్రక్కలును, రాళ్లతోను సున్నముతోను నీళ్లుతప్పుకొనిపోకుండునట్లు కట్టబడి గట్లు వేయఁబడెను. పీఠభూమి చివరనుండి క్రిందనున్న పర్వతపాతమువఱ కున్నభూమి ఏటవాలుగా నుండునట్లు చదునుచేయఁబడి పైనీరు చెదరి పోక ఏకస్థానమున క్రిందఁబడుటకై పై అంచునుండి క్రిందివఱకును బ లమైన యినుప గొట్టములు అమర్చఁబడెను. జల మీగొట్టముల నుండి కాక మఱియొకరీతిని బయటకుఁ బోకుండునట్లు పైన రాఁతి గోడలు

కట్టఁబడెను. 1725 అడుగుల యెత్తునుండి ఏటవాలుగా గొట్టములలో నుండి 13 వేల యడుగులు ప్రవహించిపడు నీప్రవాహమున కంగుళమునకు 750 పౌనుల చొప్పున శక్తిఁగలిగి యుండును. ప్రవాహము కొండక్రింద సమర్పఁబడిన చక్రములపై గొప్ప విసురుతోఁబడి వానిని మహావేగముతో నిరంతరమును త్రిప్పివేయుచుండును. ఈచక్రములుదగ్గర నిర్మింపఁబడిన విద్యుచ్ఛక్తిఁ జనకయంత్రములతోఁ గలిపియుండి 5000 అశ్వ శక్తితో విద్యుచ్ఛక్తిఁ జనింపఁజేయుట కుపయోగింపఁబడుచుండును. పర్వతపాదమునొద్ద ప్రతిక్షణమును జనింపఁజేయఁబడు యీవిద్యుచ్ఛక్తి సాధ్యమైనంత స్వల్పస్థలములోని కిముడునట్లు చేయఁబడి ఒకలక్ష అశ్వశక్తిని భరించు బలమగు తీఁగలపై కొనిపోఁబడును. లోహ నిర్మితములగు తీఁగలు మిక్కిలి ఎత్తైన స్తంభముల చివఱను గట్టిగా బిగింపఁబడి యుండును. ఈతీఁగలపై విద్యుచ్ఛక్తి ఉత్పాదకస్థానమునుండి 43 మైళ్లదూరమున బొంబాయిపుర ప్రాంతమునందలి గ్రాహకస్థానమునకు మధ్యనున్న సముద్రపు పాయను దాటించి కొనిపోఁబడి అచ్చట నిలువఁజేసి యుంచఁబడును. ఈ గ్రాహకస్థానమొక మహా మందిరమువలె నుండును. విద్యుచ్ఛక్తి నిరపాయముగా నుండు నట్లిచ్చట భద్రముచేయఁబడును. ఇచ్చటనుండి కావలసిన యంత్రశాలలు మొదలగు వానికి భూమిలోపలినుండి వేయఁబడిన గొట్టములగుండ కొనిపోఁబడిన తీఁగలద్వారాఁ దీసికొనిపోఁబడి యంత్రములను నడపించుటకును, విద్యుచ్ఛక్తి దీపములను వెలిగించుటకును, యితరములగు వివిధ కార్యములకును ఉపయోగింపఁ బడును. ఈసంఘము వారివలనయిప్పించఁబడు విద్యుచ్ఛక్తి యితర విద్యుచ్ఛక్తి సంఘములవానికన్న మిక్కిలి చౌకగా దొరకును. దీనితో బొంబాయిలోని నూలుబట్టల యంత్రములు మొదలైనవి మిక్కిలి చవుకగా నడపఁబడుచుండుటయే కాక ప్రతి యంత్రశాలను, నేలబొగ్గుతో నడు

పంబను ఆవిరి యంత్రములను తీసివేయఁ బడినందున మిల్లుల గొట్ట ములనుండి యెల్లప్పుడును పైకెగయుచు ఆకాశమునంతను అంధకార మయము కావించి లక్షల కొలఁది జనులు 'వివసిరాను' పట్టణమున నా రోగ్యకరముగను చూచుట కసహ్యముగను చేయు పొగ బొంబాయి నగరమునుండి బహిష్కరింపఁ బడుచున్నది. ప్రతి యంత్రాలయము నొద్దను ఆవిరిని పుట్టించు నిప్పు మండుచుండు. ఆవశ్యకత లేనందు న బట్టలమిల్లు లిప్పుడెక్కువ భద్రముగా నున్నవి. నూలుబట్టల యం త్రశాలల యధికారు లనేకులు యిప్పుడు ఆవిరియంత్రములను విడచి యీసంఘము వారివలన విద్యుచ్ఛక్తినే తమ మిల్లులకుఁ దెప్పించుకొ ను చున్నారు. ఇట్లు బొంబాయిపుర ప్రాంతమున నేలబొగ్గు లేని లోపములు తీరుటయేకాక అంతకన్న నధికలాభకరమును యెక్కువ ఉపయోగకర మగు నదుపాయ మీసంఘము వలన నెలకొల్పఁబడి నది. ఈవిద్యుచ్ఛక్తియంత్రశాల యేర్పడిన తరువాత బొంబాయి లో అన్నివిధములగు యంత్రశాలలును వృద్ధియగుటయే కాక ఆపు రమునకు బయట ఈవిద్యుచ్ఛక్తిఁ దీసికొనిపోఁబడు మార్గమునగూ డ క్రొత్తగా కర్మాగారములు కట్టఁబడు చున్నవి. బొంబాయి నగ రముయొక్క ఆరోగ్యము బాగుపడుచున్నది. పర్వతములపై నుండి గొట్టముల గుండ యెల్లప్పుడును ప్రవహించుచుండు స్వచ్ఛమైన వర్షోదకము ఆప్రాంతమున నున్న వేలకొలఁది యెకరముల భూమిని వ్యవసాయము చేయుటకును, కూరఁగాయలు, పూవులు మొదలగు వి విధములైన ఉపయుక్తములగు తోఁటలను పెంచుటకుఁ బ్రయత్నము లు చేయఁబడి అందుకై నూతనముగా నొకసంఘము నెలకొల్పఁబడి నది. ఇట్లు టాటా విద్యుచ్ఛక్తి సంఘమువారి కీయుద్యమము వలన చాల లాభము వచ్చుటయేకాక బొంబాయి ప్రాంతమునందలి యం త్రశాలలకును, ఆపురముయొక్క ఆరోగ్యాదులకును నిది మిక్కిలి యు

పయుక్తమగుచున్నది. ఈవఱకు మొదట యేర్పఱచుకొనిన ప్రకారమీసంఘమువారు యేటేటను సిద్ధముచేయుచున్న లక్ష అశ్వశక్తికధికమగు విద్యుచ్ఛక్తి యంతయు ఈవఱకే ఖర్చుపడుచు యింక నధికముగా కావలసి వచ్చుచున్నందున కొండలలో నింకను కొంత భాగమునుండి జల ప్రవాహమును క్రిందికిరానిచ్చి విద్యుచ్ఛక్తి నధికము చేయుటకై సంఘమువారి యజమానులచే నిశ్చయింపఁబడి వాటాదారులచే ననుమోదింపఁ బడినందున ఈసంఘము వారి 2 కోట్ల మూలధనము యింకను హెచ్చింపఁబడి కట్టడములు మొదలైనవి వృద్ధిచేయఁబడుచున్నవి.

---

## ౧౧ వ అధ్యాయము.

ప్రస్తుతకాలమున టాటా సంఘమువారు మనదేశపు పారిశ్రామికులలోను, వ్యాపారులలోను, అగ్రేసరులై యున్నారు. వారిచే ప్రారంభింపఁబడి వృద్ధినొందింపఁబడిన వివిధవ్యాపారములు మంచిలాభము నిచ్చుచుండుటయే గాక దేశపు జనులయొక్క అవసరము లనేకములఁ దీర్చునట్టివై యున్నవి. వీరి యంత్రశాలలమూలమున యిదివఱకే కొన్నిలక్షలమంది జనులు జీవికను సంపాదించుకొనియున్నారు. వీరి వ్యాపారముల జయమును జూచి యితరులుకూడ నిట్టి వ్యాపారములను ప్రారంభించుచున్నారు. వీరి యినుపయంత్రశాలలు జయప్రదముగాను, లాభకారులుగాను, ఉండుటను చూచి వంగదేశమున ఆంగ్లదేశీయులచే నిట్టిసంఘ మింకొకటి స్థాపింపఁబడినది. టాటా సంఘమువారిచే ఒకటి రెండు సంవత్సరముల మధ్యకాలమున ప్రారంభింపఁబడిన మఱికొన్ని పారిశ్రామికోద్యమములు కలవు. ఇవి యింకను ప్రారంభస్థితిలో నుండుటచే దిఙ్మాత్ర మిందు కనుపఱుపఁబడుచున్నది. వీనిలో ముఖ్యమైనది నావికానిర్మాణము. పూర్వకాలమున మహా

దూదేశమున నదులపైఁ బ్రయాణము చేయునట్టివే కాక సముద్రముపై దేశాంతరములకుఁ గూడ ప్రయాణము చేయుచుండు గొప్పనావలు నిర్మింపఁబడుచుండెననియు, హిందూవ్యాపారులు తరుచుగా ద్వీపాంతరములకు పోయి అచ్చట చిరకాలమువఱకు నివసించుచుండిరనియు, చరిత్రశోధనమువలనను ప్రత్నతత్వవిచారమువలనను తెలియుచున్నది. కొన్నికొన్ని ద్వీపాంతరములందు హిందువులు వలసగా నుండి తమ మతాదులను వ్యాపింపఁజేసిన శిలావిగ్రహ లేఖనాదిదృష్టాంతము లిప్పటికిఁ గనఁబడుచున్నవి. మనదేశపు బట్టలను చేయు పరిశ్రమ నశించినట్లే నావానిర్మాణపరిశ్రమకూడ ఆంగ్లదేశముయొక్క పోటీవలనను నిరోధమువలనను నశించిపోయినది. ఈకాలమున ప్రతిదేశమునకును ఆత్మరక్షణార్థమును వ్యాపారాభివృద్ధికొఱకు నావికాసైన్యమును, వ్యాపారనావికలు ఉండుట మిక్కిలి ఆవశ్యకమయినది. హిందూదేశమున స్వతంత్రమగు నావికాదళము లేకపోయినందున ఇప్పుడు జరిగిన యుద్ధమున హిందూదేశము ఆత్మరక్షణము చేసికొనలేక 'ఎమ్డెను' అను నొక చిన్న జర్మను నావవలన పరాభవము నొంది ప్రతిక్రియ చేయు నర్హ లేకపోయెను.

మన పరిపాలకులగు ఆంగ్లప్రభుత్వమువారు తమనావల నన్నింటిని జర్మనుయుద్ధకారణమున యూరపుఖండప్రాంతముననే యుంచుకొనవలసి వచ్చినందున హిందూదేశము జపానువారి సముద్రసేనచే రక్షింపఁబడవలసి వచ్చెను. ప్రస్తుతకాలమున జపానురాజ్యమువారును, ఆంగ్లరాజ్యాధికారులును మిత్రులుగా నున్నారు. హిందూదేశమునకు మూఁడుప్రక్కల సముద్రమే సరిహద్దుగా నున్నందున మనదేశమున వ్యాపారమునకును రక్షణమునకును స్వతంత్రమగు నావికాదళము లేకయుండుట యెంత యపాయకరమైనదియు యీయుద్ధమువలన అధికారులకును, ప్రజలకును తెలియవచ్చినది. అందువలనఁ బూర్వము మన

దేశమున గొప్ప నావాశ్రయముగా నుండిన బొంబాయినగరపు రేవునొద్ద మంచి నావలను నిర్మించుటకు తాతా సంఘమువారిచే నిప్పుడు ప్రయత్నము చేయఁబడుచున్నది. మన దేశమున నన్నివిధములగు కఱ్ఱలును దొరుకును. బొంబాయికి దగ్గరనున్న పడమటికనుమలలోని మహాటవులలో నావానిర్మాణమున కనుకూలమగు గట్టికఱ్ఱ దొరకుచున్నది. అందువలన స్థైర్యమునకును, విచక్షణజ్ఞానమునకును, వ్యాపారనైపుణ్యమునకును ప్రసిద్ధికెక్కిన తాతా సంఘమువారిచే పూనఁబడిన యీయుద్యమము తప్పక జయప్రదము కావచ్చును. గొప్పగొప్ప యంత్రశాలలను స్థాపించుటకు సహకారులగు వివిధములగు యంత్రములను చేయుటకుఁగూడ తాతావారిచేఁ గొత్తఁగా నొకసంఘము స్థాపింపఁబడినది. ప్రస్తుతము మన దేశమున కర్మాగారములలోనికే ముఖ్యమగు యంత్రము కావలసివచ్చినను ఆంగ్లదేశమునుండియో, జపాను మొదలగు యితర దేశములనుండియో తెప్పించుకొనవలసి వచ్చుచున్నది. ఇప్పుడు యుద్ధకాలమున మనదేశమునకు యంత్రములు దొరకుట దుర్ఘట మయ్యెను. యుద్ధానంతరమున నిప్పటికిని ఆంగ్లదేశాదులందు యంత్రముల యావశ్యకత మిక్కిలి యధికముగానున్నందున యంత్రముల నితర దేశములనుండి తెప్పించుకొనుట చాలకష్టముగనే యున్నది. మనదేశమున యంత్రశాలలు సులభముగా వృద్ధినొందవలెనన్న ఆవిరియంత్రము మొదలగు సాధారణోపయోగమునందుండు యంత్రములు మనదేశముననే తయారై సులభముగా దొరకుట యావశ్యకముగా నున్నది. ఇప్పుడు తాతా యినుపయంత్రశాలయందు చక్కని ఉక్కును పనిముట్లును చేయఁబడుచుండుటచేత యంత్రనిర్మాణదక్షులగు కార్మికుల సాహాయ్యమువలన తాతా సంఘమువారు యంత్రములనుగూడ మనదేశముననే చేయుటకు ప్రారంభించుచున్నారు. దీనివలన మనదేశమున యంత్రశాల లధికముగ స్థా

పింపఁబడుటకు ప్రోత్సాహము కలుగవచ్చును. తాతా సంఘముకారిచే నూతనముగ స్థాపింపఁబడిన మఱియొక యుద్యమము నారికేళపరిశ్రమము. మనదేశపు పశ్చిమప్రాంతమునందలి కొచ్చి రాజ్యమునందును, మైసూరురాజ్యమునందును అనఁగా సహ్యాపర్వతములయొక్క దక్షిణభాగప్రాంతములందు కొబ్బరితోఁటలు విరివిగా పెరుగుచున్నవి. ఇప్పటి కధమము 14 వందల సంవత్సరములకుఁ బూర్వము జీవించియుండిన కాళిదాసమహాకవి కాలమునుండియు యీప్రాంతము నారికేళోపవనములకుఁ బ్రసిద్ధికెక్కినట్లు కావ్యరత్నమగు రఘువంశమువలన దెలియుచున్నది. ఈతోఁటలు ముఖ్యముగా సముద్రతీరమునందు దట్టముగా వ్యాపించి యున్నవి. వీని కాయలు మొదలైనవి కొంతవఱకు స్వస్థానమునను కొంత చెన్నపురిప్రాంతమునకు పంపఁబడియు నుపయోగింపఁబడుచున్నను చాలభాగము కొబ్బరనార మొదలయినవి పశ్చిమతీరమునందలి రేవులలో నుండి యూరపుఖండమునకును, ఇతరవిదేశములకును ఎగుమతి చేయఁబడుచున్నవి. విదేశీయు లీనారవలన ననేక పదార్థములను కొబ్బరివలన నూనెలను ఎరువులను తయారుచేసి ఎగుమతిచేసి చాలద్రవ్యమును సంపాదించుకొనుచున్నారు. వానినన్నిఁటిని సమర్థులచే మనదేశముననే చేయించి మనదేశపుజనులే లాభమును పొందుటకై తాతా సంఘమువారు కొచ్చి, మైసూరు మహారాజుల నుండియు, ఇంగ్లీషుదొరతనమువారినుండియు ఆప్రాంతమునందలి ప్రధానభాగములను కొన్నింటిని చిరకాలపు కవులునకుఁ దీసికొని విదేశపుయంత్రములను తెప్పించి యంత్రశాలలందు వివిధములగు నారవస్తువులను, నూనెను, మఱికొన్ని యితరపదార్థములను చేయుచున్నారు. ఈపరిశ్రమము శీఘ్రముగనే వృద్ధినొంది ప్రసిద్ధికి వచ్చుచున్నది.

తాతాసంఘమువారు జనసామాన్యము యొక్క సదుపాయము కొరకు విశేషమూల ధనముతో ఇన్సూర్యెన్సు కంపెనీనొకదానినిస్థా

పించుచున్నారు. ఇట్టిసంఘము లీవరకు మనదేశమునగూడ విశేషము
గవ్యాపించి యుండుటచే నీనినిగూర్చి విశేషముగ వ్రాయ వలసిన
యవసరము లేదు. కొన్ని కంపెనీలు కావలసినంత మూలధనము లేక
యు, సరిగా నడుపఁబడక పోవుటవలన కార్యకారుల లోపమువలననుత
మధర్మమును విధులపరికారము నిర్వర్తింప నేరక పోవుటవలనను దివా
లాలు తీయుటవలనను కొన్ని యుపయోగకరము లగుటకు బదులుకొ
న్ని సంవత్సరములక్రింద కుక్కగొడుగులవలె ప్రతిగ్రామమునందును
బయలుదేరి జనులద్రవ్యమును హరించి యంతరించిన ప్రావిడెంటుకం
పెనీలవలె జనులకు శంకాభయాస్పదము లైనవి. సరియైన యాజ
మాన్యము క్రిందనుండు ఇన్‌స్యూరెన్సు కంపెనీవలన జనులకును కం
పెనీకినికూడ చాలలాభము కలుగునని కనఁబరచుటకై తాతావారి
చేసి సంఘము నెలకొల్పఁబడెను. స్వల్పమగు నెలజీతము సంపాదించు
కొనుచు కాయకష్టముచే జీవించు వారు తమయాదాయములో కొంచ
మును కంపెనీవారి పరముగానుంచి వార్ధకమున తాముపనిచేయలేన
ప్పుడు కంపెనీవారిచ్చు మొత్తముతో కుటుంబపోషణమును ఆత్మపో
షణమును చేసికొనవచ్చును. ఆకస్మికాపాయమునొందు పనివాండ్ర
బంధువు లసహాయస్థితిలో లేకుండుటకు కూడ నిది యుద్దేశింపఁబడియు
న్నది. కార్మికుల కిది యత్యుపయోగకరము. తాతాసంఘము వారి
క్రింద వేలకొలఁది కూలిజనులును, చిన్నఉద్యోగస్థులును, యంత్రాల
యములందు పనిచేయుచుండుటయు వారిసౌఖ్యముకొఱకనేక సదుపా
యములుతాతాసంఘము వారిచే చేయఁబడుచుండుటయు విదితపూ
ర్వమే. ఇదియు నట్టిసదుపాయములలో నొకటి కాని తాతాసంఘము
వారి యంత్రములలోఁ బనిచేయువారే కాక యెవ్వరైనను యిందు
ద్రవ్య ముంచుకొని దాని యుపయోగమునుఁ బొందవచ్చును. తాతా
సంఘమువారిచే నూతనముగ స్థాపింపఁబడిన వేఱొక వ్యాపారమునుఁ

గూర్చి ముచ్చటించి విడచెదము. ఇది ధనాగారములతో సంబంధించి నది. మనదేశమున ఆంగ్లనాగరికత వ్యాపించినతరువాత బ్యాంకు లను పేరఁ బ్రతిరాజధానులందును ధనాగారములు స్థాపింపఁబడి యున్నవి. వీనిలో ప్రధానమైనవానికి కొన్ని యితరనగరములలోఁ గూడ శాఖ లుండును. ఈధనాగారము లొకదేశపు జనులు వ్యాపారాదులకొఱకు మఱియొక దేశమునకు ద్రవ్యమును పంపించుటకును, అందుమూల మున అన్యదేశములనుండి తమ పూచీపై మనకు వస్తువులను తెప్పించి పెట్టుటకును సహాయమును జేయును. ద్రవ్యవంతు లీబాంకులయందు స్థిరముగా ద్రవ్యము నుంచుకొనినయెడల అందుపై వరతులనుబట్టి నూటికి సంవత్సరమునకు సుమారు అయిదురూపాయలవంతున వడ్డీ యీయఁబడును. తత్కాలమునకు మాత్రము సొమ్ము దాచుకొను వారి ద్రవ్యము భద్రముగా నుంచఁబడి అందుపైన స్వల్పమైన వడ్డీ యీయఁబడును. ఇట్లు తమయొద్ద నిలువయగు సొమ్ముతో ధనాగా రాధికారులు కొంతవఱకు వ్యాపారము చేయుదురు. కొంతనఱకు స్థి రాస్తి మొదలగు భద్రమగు తణకాపై యెక్కువ వడ్డీకి మోతుబరియ గువారికి ఋణము నిత్తురు. ఇట్టి బాంకు లనేకములు మనదేశమున నివ్వాడు వ్యాపించియున్నవి. వీనిలో మదాసు బాంకు మొదలగునవి చాలవఱకాంగ్లేయుల వశములోనే యుండి వారిచేతనే నడుపఁబడు చున్నవి. ఇండియనుబాంకు మొదలగు దేశీయులచేతనే నడుపఁబడు బాంకులుకూడ కొద్దిగాఁ గలవు. కాని వీనికి మూలధనము చాల తక్కు వగా నున్నందున గొప్పవ్యాపారములకు సహకారులు కావు. ఆంగ్లదేశ ము జపాను మొదలగు నాగరికములగు విదేశములం దిట్టి బాంకు లేగాక ప్రత్యేకముగా తమదేశమునందలి వ్యాపారప్రోత్సాహముకొఱ కేర్ప డిన ధనాగారములు కొన్ని గలవు.

ఈబాంకుల యజమానులు స్థిరముగా ననేక సంవత్సరముల వఱకుఁ దీయక తమయొద్ద ద్రవ్యము నుంచువారికి విశేషలాభము నిచ్చి

అట్లు ప్రోవైన ద్రవ్యమును ముఖ్యముగా వ్యాపారములను, పారిశ్రామిక కార్యములును చేయువారికిఁ దగిన హామీపై బదులిచ్చి యా వ్యాపారములకుఁ బ్రోత్సాహము కలుగఁ జేయుదురు. దేశమునందు కొలఁది కాలములలోనే వ్యాపారము వృద్ధియగుట కిదియొక ప్రధాన మార్గము. మనదేశమున నీవఱకట్టి బాంకు లేవియు లేవు. తాతా సంఘమువారు కొలఁదికాలము క్రింద కోట్లకొలఁది రూపాయలను మూలధనముగానుంచి అట్టి పారిశ్రామిక ధనాగారమును 'తాతా ఇండస్ట్రియల్ బాంక్' అను పేర స్థాపించిరి. దీని ముఖ్యకార్యాలయము మన దేశములోని పారిశ్రామిక వ్యాపారమునకు మూలస్థానమగు బొంబాయి నగరమున నుంచఁబడి కలకత్తా, మద్రాసు, నిజాము రాజ్యపు హైదరాబాదు, ఆంగ్లదేశములోని లండను మొదలగు ప్రధానపురములందు శాఖాగారములు వ్యాపారుల సదుపాయము నిమిత్తము నెలకొల్పఁబడెను. తక్కిన బాంకు లసాధారణ కార్యమును కూడ యీ బాంకువారు పెట్టుకొనినను వ్యాపార సహాయమే వీరి ముఖ్యవృత్తి. తాతా సంఘము లన్నిఁటితో నీబాంకున ద్రవ్యము నిచ్చిపుచ్చుకొను సంబంధము కలదు. ఇది బొంబాయిలోని అనేక పారిశ్రామిక వ్యాపారులగు భారతీయులు తమ ద్రవ్యమును తాతా బాంకులో నుంచుకొని కావలసినప్పుడు వారి పెట్టుఁబడిని పొందుచున్నారు.

కలకత్తా మొదలగు ముఖ్య శాఖాగారములు ఆయా ప్రాంతములందు విశేష వ్యాపారానుభవముగల సర్. రాజేంద్రనాథ ముఖర్జీ మొదలగు పారిశ్రామిక నాయకుల యధీనముగా నుంచఁబడినది. ఈ వఱకుఁ బనిచేయుచున్న పరిశ్రమల యధికారులు తాతా బాంకువారి ద్రవ్య సాహాయ్యమును కోరి వారితో సంబంధము నపేక్షింతురేని వ్యాపారదక్షులగు తమ ప్రతినిధులచే బాంకువారు పరిశ్రమలాభకారియగు స్థితిలో నున్నదాయను విషయమై తృప్తిని కలుగఁ జేసికొని వారికి తమ చేయూత నిత్తురు. నూతనపరిశ్రమము స్థాపింపఁబడఁబోవ

నప్పుడు దానికార్యక్రమమంతయు నొకప్రత్యేక సంఘముచే ప్రాగ్రు
గాఁబరీక్షింపఁబడి కాలక్రమమున నదిలాభకారి కాఁగలదనియు, ఉప
యోగకరమగు వ్యాపారమనియు స్థిరపడినయెడల నప్పుడది వ్యాపారమున
కువలయు ద్రవ్యరూపముగను, యితరరూపముగను ప్రోత్సాహమీ
యఁబడును. కలకత్తా మొదలగు ముఖ్యనగరములందీవరకు ద్రవ్యసహా
యము లేక ప్రారంభింపఁబడని యనేకనూతన యంత్రశాలలు తాతా
బాంకు ధనసహాయమునను, ప్రోత్సాహమునను స్థాపింపఁబడుచున్నవి.
మూలధనము చాలక నిలచిపోయినవికొన్ని పునరుజ్జీవనము నొందుచు
న్నవి. దేశీయవ్యాపారాభివృద్ధికి ఈధనాగారము చాల సహాయమును చే
యఁగలుగుటకు సందేహము లేదు. వృద్ధికిరాఁదగిన పరిశ్రమలకు మా
త్రమే యీధనాగారమువారు ద్రవ్యసహాయము చేయుదురు. తాతా
సంఘమువారి వ్యాపారానుభవము మనదేశమున ననన్యసామాన్యమని
వేరచెప్పనక్కఱలేదు. అందువలన తాతా బాంకువారి సంబంధ
ముగల కంపెనీయని ప్రకటింపఁబడుటవలన నావ్యాపార సంఘము
మంచిస్థితిలోనున్నదనియు, ముందుయభివృద్ధికి రాఁగలదనియు దానికి
ప్రసిద్ధికల్గుచున్నది. తాతావారి వివిధవ్యాపార సంఘములు దినదినా
భివృద్ధినొంది తమపట్టుదలకును, వ్యాపార నైపుణ్యమునకును, సాహస
మునకును పేరుకలిగి వేలకొలఁది కుటుంబముల జీవనమునకు నాధార
ములై, ఇతరవ్యాపారము లనేకములకు మార్గదర్శకము లగుచున్నవి.
ఈసంఘము లన్నిఁటికిని బీజములనునాటి తన బుద్ధిసూక్ష్మత వలనను,
ప్రతిభావిశేషమునను దోహదమునిచ్చి అంతరంగమిత్రుల సహాయ
మాలవాలమై యుండ దినదినాభివృద్ధినొందించి పుత్రసాహాయమున
శాఖోపశాఖలుగ వ్యాపించి ఫలింపఁజేసిన పవిత్రనాముఁడగు మహాపు
రుషుఁడు జమ్సెట్జి నస్సర్వాంజి తాతా.

---

PRINTED AT THE S, R. V, PRESS, CHITRADA,